# విషయ సూచిక

1. వేదశాస్త్రములు 1
2. చాతుర్వర్ణములు 3
3. పురాణములు 5
3ఏ. ఉప పురాణములు 6
4. అవైదికశాస్త్రములు 6
5. వైదిక శాస్త్రములు 8
6. మతాంతరముల జెప్పబడు ఆత్మలక్షణము, మోక్షము. 9
7. చతుర్దశ విద్యలు 11
8. వ్యాఖ్యాన పంచ లక్షణం 12
9. అన్వయ పంచ లక్షణం 12
10. అనుబంధ చతుష్టయం 12
11. సాధన చతుష్టయం 13
12. చతుర్విధ గురుసేవ 13
13. అధికార లక్షణం 14
14. అష్టగురువులు 15
15. సద్గురూపదేశం 16
16. బోధ త్రయం 16
17. అష్ట ప్రమాణములు 16
18. దృగ్ దృశ్య లక్షణం 17
19. కల్పిత ద్వయం 18
20. ఉపాయత్రయం 18
21. ఆత్మస్వరూప పంచలక్షణం 19
22. సత్తాత్రయం 20
23. చిత్తు చతుర్విధం 20
24. ఆనందాష్టకం 20
25. అభావ చతుష్టయం 21
26. పరిచ్ఛేదత్రయం 21
27. జీవనామ రూప వ్యవహారం 22
28. ఆత్మత్రయం 22
29. సంసార కల్పన 22
30. ఈశ్వరనామ రూప వ్యవహారం 23
31. ఈశ్వర ముఖ్య గుణములు 24
32. ఈశ్వరుని పంచకృత్యములు 24
33. రూపద్వయం 25
34. కూటస్థ పర్యాయనామములు 25
35. బ్రహ్మయొక్క పర్యాయనామములు 26
36. దృగ్వివేకం 26
37. దృశ్య వివేకం 26
38. మాయాలక్షణ పంచకం 27
39. మాయా నిర్వాచ్య నవప్రకారం 27
40. మాయా నామపంచకం 28
41. మాయా గుణ ద్వయం 28
42. మాయా వృత్తిత్రయం 28
43. గుణత్రయం 29
44. ఇంద్రియములు 30
45. వాయువులు 31
46. భూతంబులు 31
47. త్రిపుటి 32
48. ప్రకృతి కార్యోదయద్వయం 32
49. మాయాకార్యోదయ చతుష్టయం 33
50. విషయత్రయం 34
51. ప్రపంచ ద్వయం 35

| | | |
|---|---|---|
| 52. | ఉపాధిత్రయం | 35 |
| 53. | పంచావస్థలు | 36 |
| 54. | కోశపంచకం | 39 |
| 55. | తాదాత్మ్యత్రయం | 41 |
| 56. | జీవసప్తావస్థలు | 41 |
| 57. | వేదవాక్యత్రయం | 43 |
| 58. | మహావాక్యములు | 43 |
| 59. | శృతి యుక్తవాక్యం | 45 |
| 60. | ముక్తి సంశయ నిరసనం | 46 |
| 61. | ముక్తి విఘ్నత్రయం | 46 |
| 62. | అజ్ఞానాదుల విఘ్నత్రయం | 46 |
| 63. | షడ్విధలింగ తాత్పర్యం | 47 |
| 64. | మనన సహాయత్రయం | 48 |
| 65. | నిధిధ్యాస యోగపంచకం | 48 |
| 66. | ప్రతిబంధత్రయం | 49 |
| 67. | అవధిత్రయం | 50 |
| 68. | అజ్ఞానభూమికలు | 51 |
| 69. | జ్ఞానభూమికలు | 52 |
| 70. | షట్సమాధి | 52 |
| 71. | జ్ఞానఫలచతుష్టయం | 53 |
| 72. | విద్యాద్వయం | 55 |
| 73. | జీవన్ముక్తుని సద్గుణచతుష్టయం | 57 |
| 74. | జీవన్ముక్తుని పంచప్రయోజనములు | 57 |
| 75. | జ్ఞాన దశచిహ్నాం – నిగ్రహానుగ్రహం | 58 |
| 76. | ప్రారబ్ధకర్మ సంస్కారచతుష్టయం | 58 |
| 77. | ప్రారబ్ధత్రయం | 59 |
| 78. | అజ్ఞానికి జ్ఞానికి భేదం | 60 |
| 79. | జీవన్ముక్తుల శాపనుగ్రహ సామర్థ్యం | 60 |
| 80. | విదేహకైవల్యమును పొందేక్రమం | 62 |

# గురుస్తుతి

శ్లో॥ **ఏకోదేవ ఏకధర్మ ఏకనిష్ఠా పరం తపః**
**గురోః పరతరం నాన్యాన్నాస్తి తత్త్వం గురోః పరమ్॥**

తా॥ ఒకే దైవము, ఒకే ధర్మము, ఒకే నిష్ఠ, పరమమగు తపము ఆ ఒక్కటే. గురువు కన్నా శ్రేష్ఠుడు లేదు, లేదు. గురువును మించిన తత్త్వము మరి లేదు.

శ్లో॥ **నిత్యం బ్రహ్మ నిరాకారం యేన ప్రాప్తం సవై గురుః॥**
**సశిష్యం ప్రాపయే త్ప్రాప్యం దీపో దీపాన్తరం యథా॥**

తా॥ నిత్యము, నిరాకారము అయిన బ్రహ్మవస్తువును పొందినవాడు సద్గురువు. దీపం మరో దీపాన్ని వెలిగించినట్లుగా ఆయన తన శిష్యులకు అందవలసిన దాన్ని అందించును.

శ్లో॥ **జ్ఞేయం సర్వం విలాప్యైత విశుద్ధ జ్ఞాన యోగతః॥**
**జ్ఞాతృత్వ మపి చిన్మాత్రే నాన్యః పంథా ద్వితీయకః॥**

తా॥ పరిశుద్ధమైన జ్ఞానయోగంతో, జ్ఞేయమైన (తెలియబడే) దంతా తగుల బెట్టి, చివరకు ఆ చిన్మాత్రలో తన జ్ఞాతృత్వాన్ని కూడా తగులబెట్టాలి. ఇక రెండవ దారి లేదు.

శ్లో॥ **పరాత్పరతరం ధ్యాయేత్ శుద్ధ స్ఫటిక సన్నిభమ్।**
**హృదయాఽకాశ మధ్యస్థమ్ స్వాఽం గుష్ఠ పరిమాణకమ్॥**

తా॥ పరాత్పరుడు, స్ఫటికం వలె, పరిశుద్ధుడు అయిన తన గురుమూర్తిని, తన హృదయాకాశం మధ్యలో బొటనవ్రేలి పరిమాణంగా ధ్యానించవలెను.

శ్లో॥ **అంగుష్ఠ మాత్రం పురుషం ధ్యాయత శ్చిన్మయం హృది।**
**తత్ర స్ఫురతి యో భావ శ్శృణు త త్కథయామి తే॥**

తా॥ హృదయములో అంగుష్ఠ మాత్రం గల చిన్మయ పురుషుణ్ణి ధ్యానం చేస్తూ ఉంటే కలిగే అనుభవాన్ని చెప్పెదను, వినుము.

శ్లో॥ **విరజం పరమాఽకాశం। ధ్రువ మానంద మవ్యయమ్।**
**అగోచరం తథాఽ గమ్యం। నామ రూప వివర్జితమ్।**
**తదహం బ్రహ్మ కైవల్య। మితి బోధః ప్రజాయతే॥**

తా॥ నిర్మలము, పరమాకాశ స్వరూపము, శాశ్వతము, ఆనంద స్వరూపము, నాశరహితము, అగోచరము, అగమ్యము, నామ రూపాతీతము అయిన ఆ అద్వయ బ్రహ్మము నేనే అను జ్ఞానం కలుగును.

శ్లో॥ **అభ్యాసాన్నిమిషేణైవ సమాధి మధి గచ్ఛతి।**
**జన్మకోటి కృతం పాపం తత్క్షణా దేవ నశ్యతి॥**

తా॥ ఇలా అభ్యసించుట వలన (సాధకుడు) ఒక్క నిమిషంలోనే సమాధిస్థితిని పొందగలడు. కోట్లాది జన్మలలో చేసిన పాపాలు ఆ క్షణంలోనే నశించును.

శ్లో॥ **పిండే ముక్తా పదే ముక్తా రూపే ముక్తా వరాననే**
**రూపాతీతే చయే ముక్తాస్తే ముక్తా నాత్ర సంశయః॥**

తా॥ వరాననా! పిండ పద రూప రూపాతీతముల నుండి ముక్తుడగు వాడే నిస్సంశయముగా ముక్తుడు.

శ్లో॥ **సర్వజ్ఞ పద మిత్యాహుః దేహీ సర్వమయో బుధాః**
**సదానందః సదాశాంతః రమతే యత్రకుత్రచిత్।**

తా॥ సదానందుడు, సదా శాంతుడునై ఎచటనైన రమించెడి దానిని సర్వ మయుడని, అది సర్వజ్ఞ పదమని బుధులందురు.

శ్లో॥ **స్వయంబ్రహ్మమయో భూత్వా। తత్పరంచావ లోకయే।**
**పరాత్పరంనాన్యత్। సర్వగ్ం తన్నిరామయం॥**

తా॥ జనుడు తాను బ్రహ్మరూపియై ఆ పిమ్మట దానికతీతమైన పరస్వరూపమగు కేవలాత్మను జూచును. అట్టి పరస్వరూపమగు పరిపూర్ణము కంటె అన్యమేదియును లేదు. అది యంతటను నిండియుండినదియును, నిరామయమైనదియునై యున్నది. అది దేనికిని ఆధారము కాదు.

శ్రీ గురువే నమః

# వివేక చింతామణి

## 1. వేదశాస్త్రములు

ప్రథమంబున ముఖ్య ప్రమాణంబులగు ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వణవేదంబులే స్వయంభువులని యీశ్వర ప్రణీతంబులని జెప్పదగినవి చతుర్వేదంబులు. వాటిలో ఋగ్వేదంబు ఏకవింశతి భేదంబు, యజుర్వేదంబు నవాధికశత భేదంబును, సామవేదంబు సహస్ర భేదంబు, అధర్వణవేదంబు పంచాశద్భేదంబైయుండు. వాటియందు విధివాదం బర్థవాందబు మంత్రవాదంబు నామధేయంబులనెడి చదుర్భేదంబులచే సమస్తార్ధంబులు బోధింపబడుచుండు. వాటియందు రాజాజ్ఞవలెనే పురుషుల దుష్కృతంబులను విడిపించి ధర్మమే చేయతగ్గది యని నియమించునది విధివాదంబు. వందిజనంబుల కైవడి అవిద్యార్ధంబులు కొనియాడునది అర్ధవాదంబు. ఆచార్యుని చందంబున చేయతగినది చెప్పునది మంత్రవాదంబు. జననీ జనకుల తెరంగున యాగాదులకు నామంబు లిడినవే నామధేయంబులన దగు. మరియు నావేదంబునకు అవి పాద హస్త ముఖ ఘ్రూణ నేత్ర శ్రోత్రంబులయినవి, క్రమంబుగా ఛందస్సును, కల్పంబును, వ్యాకరణంబు, శిక్షయు, జ్యోతిషంబును, నిరుక్తమనదగినవే షడంగములు. వాటిలో ఛందస్సు మంత్రాదులకు, త్వష్టువు మొదలయిన ఛందంబులచేత నక్షర గణంబుల జేయును. కల్పమే ఆశ్రాయణియ్య, బోధాయనియ్య, ఆపస్తంభియ్య సూత్ర రూపంబులచే యజ్ఞ ప్రయోగాదుల జెప్పును. వ్యాకరణంబు వైదిక శబ్దస్థితిని సమర్ధించును. శిక్షయనునది ఉదాత్తానుదాత్తస్వరిత ప్రచయంబులననెడి చతుర్విధ స్వరకారణ

పూర్వకంబుగా పద పాఠ క్రమంబుచే వేదాధ్యయనాదులను వివరించును. జ్యోతిషంబు లగ్న తిథి నక్షత్ర యోగ కరణంబులచేత వైదిక కర్మంబులకు కాలంబుల దెలుపును. నిరుక్తము వైదిక శబ్ద నిర్వచనంబు చేయుచు నియమింపుచుండును. అనంతరంబున, మీమాంస న్యాయశాస్త్ర పురాణ స్మృతులన దగిన నాల్గు వేదంబుల కుపాంగంబులు. వీటి లక్షణంబులు ముందర జెప్పంబడును. పిదప ఆయుర్వేద, అర్ధవేద, ధనుర్వేద, గాంధర్వ వేదంబు లనదగినవి నాలుగు ఉపవేదంబులు. వాటియందు ఆయుర్వేదంబు వ్యాధి నిదాన, వ్యాధి చిహ్న, మంత్రౌషధ చికిత్సలచేత ఆయురారోగ్యాదుల జూపును. అర్ధవేదంబు దక్షిణాజ్యచరూప హోరాదులం జెప్పును. కావున, ధర్మాది చదుర్వర్గ సాధనంబై యుండు ధనుర్వేదంబు శత్రుజయార్ధంబుగా మంత్రాస్త్ర ప్రయోగాదుల దెలుపు. గాంధర్వ వేదంబె సామవేదాదులలో స రి గ మ ప ద ని అనునట్టి సప్తస్వర గీత ప్రబంధంబులను విభాగించుచుండును. అనంతరంబున శ్రీరుద్ర, బృహదారణ్య కైవల్య, కాలాగ్ని, కఠవల్లి, కాత్యాయన, బ్రహ్మ, నారాయణ, హంస, పరమహంస, భాష్కళ, బ్రహ్మబిందు, ఆరుణి, అమృతబిందు, చర్చ, పంచబ్రహ్మ, జాబాలా, తేజోబిందు, వాజసనీయ, బోధాయనీయ్య, అశ్రాయణియ్య, మైత్రాయణియ్య, సాంఖ్యాయనీయ్య, వాసురాయణియ్య, శౌనకియ్య, శివసంకల్ప, శ్రవణ, పరాక్రమ, ప్రోజ్య, ముద్గల, ముండకంబులనునవి ఉపనిషత్తులు. వాటియందు జ్ఞానాంగంబులైన భస్మ, రుద్రాక్షాదులను, బ్రహ్మజ్ఞానంబును వివరింపబడుచుండు. అనంతరంబున మనుస్మృతి, అత్రిస్మృతి, హారితస్మృతి, విష్ణుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, ఉశనస్మృతి అంగీరసస్మృతి, యమస్మృతి, ఆపస్తంభస్మృతి, సంవర్తస్మృతి, కాత్యాయనస్మృతి, బృహస్పతిస్మృతి, పరాశరస్మృతి, వ్యాసస్మృతి, శంఖలిఖితస్మృతి, దక్షస్మృతి, గౌతమస్మృతి, శృతాతపస్మృతి, వసిష్ఠస్మృతులన దగినవే ఆయా నామధేయంబులు గలవారి



చేత చెప్పండిన యేకోన వింశతి ధర్మశాస్త్రంబులు. వాటియందు కృతయుగంబున మనుస్మృతి ధర్మంబై ముఖ్యమై యుండు, త్రేతాయుగంబునందు గౌతమస్మృతి ధర్మంబై ముఖ్యమైయుండు. ద్వాపరంబున శంఖలిఖితస్మృతి ధర్మంబై ముఖ్యమైయుండు, కలిగియుగంబున పరాశరస్మృతి ధర్మంబై ముఖ్యమై యుండు. స్మృతులయందు జాతివర్ణాశ్రమాచారంబులును దాయాదవిభాగాది అష్టాదశ వ్యవహార భేదంబులను మహాపాతకాదులకు ప్రాయశ్చిత్తాదులును విధింపబడును.

## 2. చాతుర్వర్ణములు

కమ్మె, కంనడి, ఆంధ్ర, ద్రావిడలను నాలుగు జాతులు. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను చాతుర్వర్ణంబులు. వారియందు గర్భాదాన, పుంసవన, సీమంత, ఉన్నయన, జాతకర్మ, నామకరణ, ఉపనిషత్క్రమణ, అన్నప్రాశన, చౌల, ఉనయన, మహానామ్నిక, మహావ్రత, ఉపనిషత్తు, శోభన, ఉద్వాహ, జార్ధ్వ దైహికంబులనదగిన షోడశ కర్మంబులుంగలిగి యజిన, యాజనాధ్యయనాధ్యాపక దాన, అదాన, ప్రతిగ్రహంబులను షట్కర్మంబులు గలిగి శివభక్త్యాది సకల సద్గుణంబులు గలవాడె బ్రాహ్మణుండు. తదనంతరంబున, ప్రజాపాలన, యజన, అధ్యాపనవర్జన, దుష్టమృగపక్షి శతృసంహార, అన్నదాన, వస్త్రదాన, కన్యాదాన, భూదాన, హిరణ్యాదాన, గోదాన, ఉభయముఖీగోదాన, మహిషీదాన, అశ్వదాన, శ్వేతాశ్వదాన, కాళముఖీదాన, మహామేరుదాన, కల్పవృక్షదాన, విద్యాదానాది మహాదానంబులు గలిగి, తద్దానార్ధంబుగా దేశకాల పాత్రంబులెరింగి విష్ణుభక్త్యాది కర్మ యుక్తుండగువాడె క్షత్రియుండు. పిదప ప్రథమస్థాన ద్వితీయస్థాన తృతీయస్థాన చతుర్థస్థాన పంచమస్థానంబులాదిగా ముప్పదారు స్థానంబులు క్రమంబుగా ఏకం, దశం, శతం, సహస్రం, దశసహస్రం, లక్ష, దశలక్ష, కోటి, దశకోటి, శతకోటి, అర్బుద, నిర్బుదం, ఖర్వం,

మహాఖర్వం, పద్మం, మహాపద్మం, క్షోణి, మహాక్షోణి, శంఖం, మహాశంఖం, క్షితి, మహాక్షితి, క్షోభం, నిధి, మహానిధి, సాగరం, మహాసాగరం, హరి, మహాహరి, సంఖ్య మహాసంఖ్య, ఫణి, మహాఫణి, క్రమం, మహాక్రమంబులన, నివెగణనలు. మరియు ఏకా, యక్క, భూమి, చంద్ర యివి మొదలయినవి ఏకసంజ్ఞలు. ది, ద్వం, ద్వ, ద్వయ, ద్వితియ్య, యుగ్మ, యుగళ, యుగ, ఉభయ, బాహు, పాద, పక్ష, నయనములను నివి ద్వితీయ్యంబునకు సంజ్ఞలు. త్రయ, తృతియ్య, హరనయన, అగ్ని, పుర, పర, రత్నాదులు మూడనుటకు సంజ్ఞలు. చతురగతి, కషాయ, వెద, వర్ణ, ఆశ్రమ, సముద్ర మొదలుగా గలవె నాల్గనుటకునగు సంజ్ఞలు. పంచ, హరి, వక్త్ర, వ్రత, ఇంద్రియ, బాణ, వీషయ, పాండవ, భూతాదులు ఐదనుటకు సంజ్ఞలు. షట్, ద్రవ్య, ఋతు, రస, స్కంధముఖి, వేదాంగ, కర్మ దర్శన, అర్థంబాదిగా గల సంజ్ఞలు ఆరనుటకను, సప్త, ముని, గిరి, రాజ్యాంగ, తురగ, ధాతు, సభాంగ, స్వర, సాగర మొదలుగాగలవి ఏడనుటకు సంజ్ఞలు. అష్ట, వసు, మద, పాశాది సంజ్ఞలు యెనిమిదనుటకును, నవ, నిధి, రంధ్ర, రస, గ్రహ, భక్త్యాది సంజ్ఞలు తొమ్మిదనుటకగును. బిందు, శూన్య, నాస్తి, అనుస్వార, గగన సంజ్ఞలు సున్న పేరగు. ఇట్లు సకల సంఖ్యా సంజ్ఞ లెరిగి భాగలక్షణంబులు దెలిసి గణితాదులంగుతించి క్రముకాది సమస్త వస్తువుల ప్రమాణించులేఖ, వడ్డి, వాత, శ్రయం, పత్రం, పట్టి, బంగారు, వన్నెలు, పవడంబుల కణుజులు, మణులచౌలు, రత్నంబుల సూత్రపరీక్ష, వజ్రమంజాడి, పచ్చరతులు మొదలయిన భేదంబులెరింగింప రూకల యెత్తు గద్దెణం, బదినాల్గైనకర్షం, బదిల్గైనహలం, బదియిరువదైన వీశె, బదియైదైన నొక్కతులం, బదియిరువదయిన నొక్క భారం, ఆ భారవలు పదియైన నొక్క యచితంబునవి కర్పూరం బాదిగాగల పదార్థంబులు తూనికెలెరింగి, మరియు నొక్క సాలిగె



పేరునికుంజం, బదినాల్ గైనకుడుబం, బదినాల్గైన ప్రస్తం, బదిరెండైన నొక్క వాహం, బదిరెండైన నొక్క ఆధకం, బదినాల్గైన నొక్క ద్రోణం, బడియైదైన నొక్కఖారియగునని ధాన్యాదుల కొలత లెరింగి, వాణిజ్య, కృషి, గోరక్ష, సూర్య భక్త్యాది కర్మయుక్తుండె వైశ్యుండు, మరియు బ్రాహ్మణాది వర్ణత్రయ సేవ క్షేత్ర పాలన సకల దేవతాభక్త్యాది కర్మయుక్తుండు శూద్రుండనబడు.

## 3. పురాణములు

బ్రహ్మపురాణ, పద్మపురాణ, వైష్ణవపురాణ, శైవపురాణ, భాగవతపురాణ, నారదియ్యపురాణ, మార్కండేయపురాణ, ఆగ్నేయపురాణ, భవిష్యత్పురాణ, బ్రహ్మవైవర్తపురాణ, లైంగ్యపురాణ, వారాహపురాణ, స్కందపురాణ, వామనపురాణ, కూర్మపురాణ, మత్స్యపురాణ, గారుడపురాణ, బ్రహ్మాండపురాణంబులన నివేశివానుగ్రహంబుచే వ్యాసఋషీశ్వరోక్తంబులన వేదంబులనష్ఠశాఖార్థ ప్రతిపాదకంబులైన నాల్గు లక్షల గ్రంథ సంఖ్య గల అష్టాదశ మూల పురాణంబులు, వాటియందు శైవ, స్కంధ, లైంగ్య, కూర్మ, వామన, వరాహ, భవిష్యత్తు, మత్స్య, మార్కండేయ, బ్రహ్మాండంబులనెడి దశ పురాణంబులె, శివపురాణంబు లనందగు. నారదియ్య, భాగవత, గారుడ, విష్ణుపురాణంబులు నాల్గు, నారాయణ ప్రతిపాదికంబులు. బ్రహ్మ పద్మ పురాణంబులనెడి రెండు చతర్ముఖ ప్రతిపాదికంబులు, బ్రహ్మవైవర్తకంబను నొక్క బురాణంబె సూర్య ప్రతిపాదికంబును, ఆగ్నేయపురాణంబనునొక్కటి అగ్ని ప్రతిపాదకంబు. ఇందు దేవతా తారతమ్యంబులు గ్రహింపంబడు. మరియు నాపురాణంబులందు సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశాను చరితంబులను పంచలక్షణంబులును, సమస్త, వైదిక తాంత్రిక ధర్మంబులును విదితంబగు.

## 3ఎ. ఉపపురాణములు

ఉపపురాణంబులెవ్వియనిన సనత్కుమారపురాణ, నారసింహపురాణ, నందిపురాణ, శివధర్మపురాణ, దుర్వాసపురాణ, నారదియ్యపురాణ, కపిలపురాణ, మాణవపురాణ, ఉశనపురాణ, బ్రహ్మాండపురాణ, వారుణపురాణ, కాళిపురాణ, వాశిష్టపురాణ, లైంగ్యపురాణ, సాంబపురాణ, సౌరపురాణ, పరాశరపురాణ, మారీచపురాణ, భార్గవపురాణంబులనేటివి ఆయా నామధేయంబుగల వారిచేత నిరూపితంబులయిన వుపపురాణంబులు. వీటియందు వైదిక ధర్మాదులన్నియు ప్రతిపాద్యంబులగు. మరియు భారత రామాయణంబులను రెండే వ్యాస వాల్మీకులచే నిరూపించబడిన ఇతిహాసంబులందు సత్వాదిగుణ విభేదంబులను త్రిదేవతా లక్షణంబులును దేవదానవాది జనన క్రమంబును యుధిష్టిర రామచంద్రాది రాజవృత్తాంతంబు సువైదిక ధర్మంబులును ప్రతిపాద్యంబులై యొప్పు.

## 4. అవైదీక శాస్త్రములు

బృహస్పతి, అహర్తసుగతులన దగినవారిచే గ్రమంబుగా చెప్పంబడిన, చార్వాక, జైన, బౌద్ధంబులనెడి అవైదిక శాస్త్రనితంబందు చార్వాకంబున పృథివ్యాది చతుర్భూత వికారంబైన జగత్తునందు సుఖమే స్వర్గంబు, దుఃఖమెనరకంబుగాక వేరేస్వర్గ నరకంబులు లేవని జెప్పియుండు. మరియు జైనంబునందు శిద్ధ బద్ధ నారకులను పురుషత్రయము లక్షణంబును విడ్డీశ, వడ్డామలేశ, జ్వాలనికల్ప, పద్మావతీకల్ప, శారదాకల్ప, కుక్కుటనాధాది కల్పంబులచే మంత్రౌషధాది ప్రయోక్తృవులైన పరమసిద్ధులున్ను, లూనకేశ, దిగంబర, పాణిపాత్ర, మయూరపించ, పంచమలధారణంబును, అనృత, చౌర్య, పరదార, అతికాంక్ష, హింసలు మొదలయినవి వర్జించుటలనెడి పంచాణు వ్రతంబులచేత మధు, పలాందువలు, మొదలైన నిషిద్ధ ద్రవ్యంబుల విడిచి తప్తశిలా శయనాదులు గలిగి, వుగ్రతపంబాచరించెడి మునుల వృత్తులచే హేమచంద్ర, నాగచంద్ర, నేమిచంద్ర, మేఘచంద్ర, మాఘచంద్ర, అహర్త, ఆదినాథ, అగ్గళ, పార్శ్వనాథ, సౌగత, శృతకీర్తి, శ్రీమతి, కామరహిత మునిస్వాములనెడి చతుర్వింశ తీర్థంకర చరిత్రంబులను, స్యాదస్తి, స్యాన్నాస్తియను నిధి మొదలుగా గల సప్తభంగులను, జీవ, సజీవ, నిర్జీవ, నిర్జర ఆశ్రమబంధ మోక్షములను సప్త పదార్ధంబులను ప్రతిపాదింపబడుచుండును. బౌద్ధంబు భూమ్యాదిగా బుద్ధికడగాగల త్రయోవింశతి తత్వాత్మక ప్రపంచంబంతయు దీప జ్వాల లెట్లట్ల క్షణికంబులని చెప్పుచుండు. సౌత్రాంత్తిక, వైభాషిక, మహాయానక, సంస్కృతంబులని చతుర్విధంబులైయుండు. పిదప సత్యనాథ, సతోకనాథ, ఆదినాథ, అనాదినాథ, అకులితనాథ, మతంగనాథ, మత్స్యేంద్రనాథ, ఘటయంత్రనాథ, గోరక్షనాథాదు లనదగిన నవనాథ సిద్ధులచే కల్పితంబులయిన కాలయామళాదులే హింసా మైధునాది నిషిద్ధ కర్మంబులు గల శాస్త్రాంతరంబులు. వాటియందు అభిచారకర్మ జనిత ఆధిద్వారా అకాలమృతిరూప మరణంబనెడి సుప్తి, విష, మూర్ఛ, అదృశ్యకరణ, లక్షణ, మోహనములనెడి అగ్నిస్తంభ, జలస్తంభ, ఇంద్రియస్తంభ, ఖడ్గస్తంభ, జిహ్వాస్తంభ, గతీస్తంభాది రూప స్తంభనంబులనెడి పూర్వసుఖాశ్రయానికి రసనాత్మక ఉచ్చాటనంబనెడి వస్త్రాభరణ వాహన వనితాదివస్తు నిజస్తానాగత లక్షణాకర్షణం బనదగిన షట్కర్మంబులును, రాజవశ్య, జనవశ్య, స్త్రీవశ్యంబులును జ్వరభూత, గ్రహావేశంబులును, పాదుకాసిద్ధి, అంజనసిద్ధి, ఘటికాసిద్ధి, మూలికాసిద్ధి, రసనాదంబులను సిద్ధులు జెప్పంబడును.

## 5. వైదికశాస్త్రములు

శక్తితత్త్వవాసియగు నొకానొక యాత్మ చేతను వాసుదేవుని చేతను క్రమంబుగా జెప్పంబడిన శాక్తేయపాంచరాత్రంబులను నివిప్రత్యేక శాస్త్రంబులు. వాటియందు శాక్తేయంబు జడాజడ ప్రపంచంబంతయు శక్తిపరిణామంబను నివి మొదలైనవి వివరింపబడుచుండును. పాంచరాత్రంబు పృథివ్యాది మానసాంతముగా గల చతుర్వింశతి తత్త్వంబులను, మీద గుణతత్త్వాత్మక వాసుదేవునిచే జగదుద్ధితార్థంబుగా కృష్ణా, అనిరుద్ధ, మకరధ్వజ, రౌహిణేయులను నలువురుత్పత్తి మొదలైనవి జెప్పంబడును. మరియు లౌకిక, వైదిక, ఆధ్యాత్మిక, అతిమూర్థిక, మాత్రంబులను నివి పంచవిధ శాస్త్రంబులు. వీటియందు లౌకికంబెట్లనిన ధన్వంతర్యాదుల చేత నుక్తంబైన ఆయుర్వేదంబు దండనీతి మొదలైన దృష్టఫలంబుల జెప్పును. మరియు జైమిని అక్షపాదకాదులను ఋషీశ్వరులచే క్రమంబుగా జెప్పండిన పూర్వమీమాంస న్యాయవైషికంబులను దృష్టాదృష్ట ఫలంబులు గల యవి వైదిక శాస్త్రంబులు. వాటియందు పూర్వ మీమాంస ఉపక్రమాది షడ్విధలింగ తాత్పర్యంబులచేత వేద వాక్య విచారణ పూర్వకంబుగా జ్యోతిష్టోమ యాగాదుల క్రమంబుగా వివరించును. న్యాయంబు, ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాంత, సిద్ధాంత, అవయవ, తర్క, వాద, జల్పవితండ, హేత్వా, భాస, ఛల, జాతి, నిగ్రహ స్థానంబులనెడి షోడశ పదార్థంబులం జెప్పుచు ప్రపంచంబున కీశ్వర కర్తృకత్వంబును సాధించు. వైశేషికంబు ద్రవ్యగుణకర్మ సామాన్య విశేష సమవాయంబులను షట్పదార్థంబుల ప్రతిపాదనంబుచే ప్రపంచ స్వరూపంబు విభాగింపుచుండు. అనంతరంబున కపిల, పతంజలి, వ్యాసులను, మునులచే గ్రమంబుగా జెప్పంబడిన సాంఖ్య, పాతంజలి, వేదాంతంబులను నాత్మజ్ఞాన



ఫలంబుగా గల అధ్యాత్మ శాస్త్రంబులు. వాటియందు సాంఖ్యంబు నిత్యనిర్మలులయిన ఆత్మల సన్నిధానంబుచే గుణత్రయాత్మీక ప్రకృతీయనదగిన పంచవింశతి తత్త్వాత్మక ప్రపంచ రూపంబుగా వ్యవహరించుటె సంసార బంధనంబనియును సత్వాది గుణత్రయాను క్రమంబుచే శ్లేష్మప్రకృతి వాతప్రకృతి పిత్తప్రకృతులు గల శాంతి క్రోధ మూఢతాది గుణులైన ఉత్తమ, మధ్యమ అధమపురుషుల వర్ణరీతుల మొదలుగాగల క్రమంబు లెరింగించు. పాతంజాలంబున యమాద్యష్టాంగ యోగంబుచేత మనో నిశ్చలత్వంబు సిద్ధించునని చెప్పుచుండు, ఉత్తరమీమాంసయు ఉపనిషదర్థ ప్రతిపాదకంబైన వేదాంత శాస్త్రంబందె ప్రపంచంబునకు మిథ్యాత్వంబు సాధించుట వల్ల బ్రహ్మైక్యమునె వర్ణించును. భాస్కరీయ్య, మాయావాద, శబ్దబ్రహ్మవాద, క్రియాబ్రహ్మ వాదంబులను నాలుగు తెరంగులయి యుండు. అనంతరంబున మాయాతత్త్వ, విద్యాతత్త్వ, కాలతత్త్వ, వాసులయిన త్రిరుద్రులచేత విరచితంబైన పాశుపత, కాపాలిక, మహావ్రతములను నివి అతి మార్శిక శాస్త్రంబులు. వాటియందు పాశుపతంబు మాయాకార్యంబులను పాశద్వయంబులను చెప్పుచుండు, కాపాలికంబు నరకపాల భిక్షాటనంబుల వర్ణించును. మహావ్రతంబె ఆస్తి ధారణాదుల వర్ణింపుచుండు. మరియు పరశివ ప్రణీతంబైన మాత్రంబే మోక్షాంగంబైన క్రియాచార యోగజ్ఞానంబుల వర్ణింపుచుండు.

## 6. మతాంతరముల జెప్పబడు ఆత్మ లక్షణము, మోక్షము

సమస్త మతాంతరంబులందు జెప్పంబడిన నాత్మ స్వరూపంబెట్టిదనిన చార్వాకులు దేహమె ఆత్మయందురు. చార్వాకైకదేశులు ప్రాణంబె ఆత్మయందురు. పిదప దేహాది విలక్షణుండు నొక్కయాత్ముండె దేహపరిమితుండై మధ్యమ పరమాణుత్వంబుచే సంకోచ వికాస ధర్మ

యుక్తుండందురు జైనులు. బుద్ధియె ఆత్మయందురు బౌద్ధులు. ఆనందంబె ఆత్మయందురు కౌళయామళ శాక్తేయులు, ఆత్ముండు దేహ పుత్రాది రూపుండందురు లౌకికులు. ఆత్ముండు స్వతఃప్రమాణ జ్ఞాన సమేతుండనువారు మీమాంసక భేధ భాట్టప్రభాకరలనువారు. ఆత్ముండు గగనంబువలె మహత్పరమాణుండై పాషాణంబట్లు జడరూపుండైయ్యు మనస్సంయోగంబుచే చిద్ధర్మయుక్తుండందురు నైయ్యాయికవైశేషికులను వారలు. ఆత్ముండసంగ చిన్మాత్రుండందురు సాంఖ్య పాతంజలులనువారు. ఆత్ముడు జ్ఞప్తిమాత్రుండందురు వేదాంతులు. ఆత్ముండు నిత్యవ్యాపక చైతన్యుండందురు పాశుపత కాపలిక మహావ్రతులనువారు. ఆత్ముండు నిత్యవ్యాపక జ్ఞానక్రియా రూపుండందురు. మాంత్ర సౌంజ్ఞిక సిద్ధాంతులని పృధక్కరింపందగు. మరియు నీ సకలవాదులచే చెప్పంబడిన మోక్షంబెట్లనిన మరణమె మోక్షంబందురు చార్వాకులు. లౌకికాకాశ మధ్యంబున ఉత్తరోత్తరగమనంబె మోక్షంబను వారు జైనులు. సుఖదుఃఖాదులనంటని శుద్ధబుద్ధి సంసక్తియె మోక్షంబందురు బౌద్ధులు. ఆకాశ గమనాది సిద్ధిప్రాప్తియె మోక్షంబందురు కౌళయామళులు, ఆనంద ప్రాప్తియె మోక్షంబందురు శాక్తేయులు, వాసుదేవాత్మక ప్రకృతియందు స్వరూప హానిలేక అణగియుండుటె మోక్షంబందురు పాంచరాత్రులు. ఇహపరంబులందు భార్య పుత్రాదులం గూడి వ్యాధ్యాది దుఃఖంబులేక సుఖంబుగానుండుటె మోక్షంబందురు లౌకికులు. స్వర్గాది పదప్రాప్తియే మోక్షంబందురు పూర్వ మీమాంసకులు. ఆత్మ శరీరాదికంబులనెడి ఏకవింశతి దుఃఖాత్యంత నాశంబుచే పాషాణప్రాయుండై యుండుటె మోక్షమనువారు న్యాయవైషికులు, ప్రకృతీ పురుష వివేకంబుచేతనె అవిద్యానాశంబందుటె మోక్షంబందురు సాంఖ్యులు. యోగాభ్యాస బలంబుచే మనోలయద్వారా అజ్ఞానంబుడుగుటె మోక్షంబందురు పాతంజలులు, బ్రహ్మాత్మైకత్వ జ్ఞానంబుచేత వ్యావహారిక బంధనివృత్తియె



మోక్షమందురు వేదంతులు, ప్రవాహేశ్వరత్వంబుచేత యీశ్వరత్వంబన్యాధీనంబుజేశి ఆత్ముండుజ్ఞప్తి మాత్రుండైయుండెటె మోక్షబందురు పాశుపతులనువారలు. కర్తృత్వంబె సంసారంబగు గావున నిదివిడిచి జ్ఞప్తి మాత్రుండైయుండుటె మోక్షంబందురు కాపాలిక మహావ్రతులు. ఆత్మునకు షడధ్వాతీత శివ సమానత్వంబె మోక్షంబందురిట్టి సిద్ధాంతులని తెలియంబలికి, మరియు నీ వాదులందు చార్వాకంబైన బౌద్ధమీమాంసక సాంఖ్యులను వారె నిరీశ్వరవాదులు. తక్కిన వారె యీశ్వరవాదులు. వేదాంతియొకండె అభేదవాదియై యుండు.

## 7. చదుర్దశవిద్యలు

ఇట్లు జెప్పిన సకల శాస్త్రంబులందు వేదంబులు నాల్గు, వేదాంగంబులారు, న్యాయమీమాంసంబులు రెండు, స్మృతి పురాణంబులు రెండు గూడి చతుర్దశవిద్యలని జెప్పంబడు. వాటియందు మీమాంసయను నదొక్కటె మరీ విశేష్యమయి వింశత్యాధ్యాయ మనంబడి కర్మార్థ ప్రతిపాదకత్వంబుచే తద్విభాగంబై యుండు, దానియందు మొదటి భాగంబె జైమిని సూత్రరూపంబై ద్వాదశాధ్యాయ మనదగి కర్మ కర్తృ ప్రతిపాదకంబై లోక వేదాధికరణమనెడి మొదలయిన శాస్త్ర న్యాయంబులచె పూర్వ మీమాంసయనబడు. నా జైమిని సూత్రంబునకు శాబరంబను భాష్యంబు చేయంబడియె.

మరి యామీమాంస శాస్త్రంబునకు భట్టాచార్యులచాత వార్తీకరూపంబుగా భాట్టిమని యొక మతాంతరంబు రచితంబయ్యె, మరియు భట్టాచార్యుల శిష్యుడైన ప్రభాకరుడను గురుని చాతను శాబర భాష్యంబునకు ప్రభాకరమని యొకమతాంతరంబు చేయబడియె.

మరియు రెండోదైన భాగంబె బ్రహ్మార్థ ప్రతిపాదకంబు చేత ఉత్తర

మీమాంసయనదగి వ్యాససూత్ర రూపంబుచె అష్టాధ్యాయంబైయుండు. దానియందు పూర్వమైన నాల్గధ్యాయంబులె దేవతాకాండ మనిపించి యుండు.

దానిలో మంత్రవాదంబట్లు దేవతాలక్షణంబె బలభద్రరామునిచే ప్రతిపాదింపబడి ఏతదుత్తరంబైన నాల్గధ్యాయంబులు బ్రహ్మకాండమనబడు. దానికి బ్రహ్మాత్మైక ప్రతిపాదకంబుగా శ్రీమచ్ఛంక్కర భగవత్పాదులచేత భాష్యంబు చేయంబడియె. పిదప భాష్యంబునకు వివరణాచార్యుల చేత వివరణంబు చేయంబడియె. మరియు నావివరణంబె వేదాంత శాస్త్రంబని యెరుంగదగు. అనంతరంబున వేదాంత శాస్త్ర విచారంబెట్లనిన ఆశీర్వాద నమస్కారవస్తునిర్దేశంబులనునివె శాస్త్రారంభంబునందు చేయందగిన మంగళా చరణంబులు.

## 8. వ్యాఖ్యాన పంచలక్షణం

పద, పదార్థ, వాక్య యోచన, ప్రశ్న, పరిహారంబులను నివి వ్యాఖ్యాన పంచలక్షణంబులు.

## 9. అన్వయ పంచలక్షణం.

విశేష, విశేష్య, కర్తృ, కర్మ, క్రియలను నివి అన్వయ పంచలక్షణంబులు.

## 10. అనుబంధ చతుష్టయం

విషయ, సంబంధ, ప్రయోజన, అధికారులనునివి శాస్త్రంబునకు అనుబంధ చతుష్టయంబు. దానియందు శాస్త్రంబునకు జీవ బ్రహ్మంబుల కేకత్వంబె విషయమనదగు. బ్రహ్మశాస్త్రంబులకు ప్రతిపాదద్య ప్రతిపాదక భావమె సంబంధమని పించును. సకల దుఃఖనివృత్తిచే నిత్యానంద పదప్రాప్తియె ప్రయోజనమనబడును. సాధన చతుష్టయ సంపన్నుండె అధికారియనదగు.



## 11. సాధన చతుష్టయం

నిత్యానిత్య వస్తు వివేక, ఇహాముత్రార్థఫలభోగవిరాగ, షట్కశమాది ముముక్షత్వములను నివేసాధన చతుష్టంబు. వీటి యందు చిద్రూపంబె నిత్యంబు. తక్కిన సమస్తంబు మిథ్యని తెలియుటె నిత్యానిత్య వస్తు వివేకంబు. ఇహపరంబులందును వనితాది భోగ విషయంబు లన్నియు కర్మ జన్యంబులు. గావున అనిత్యంబులయ్యు సంపాదనంబున కాదియందున, భోగంబును అంతంబునందు క్రమంబుగా మహాప్రయాస వైర హాస్యంబులు గల్గుట చేతను దుఃఖ రూపంబని మనంబునం గరకనుండుటె ఇహాముత్రార్థ ఫలభోగ విరాగంబనదగు. దమంబు మొదలగు షడ్గుణ సిద్ధియె శమమనదగు. సహజ సాయుజ్య మోక్షాపేక్షయె ముముక్షుత్వంబనదగు. మరి యంతః కరణ నిగ్రహంబె శమమనందగు. బాహ్యకరణ నిగ్రహంబె దమమనబడు, క్రోధాదుల సహించుటె తితీక్షయననొప్పు, సకల కర్మపరిత్యాగంబె ఉపరతియనందగు, శృతి గురువులయందు కేవల విశ్వాసంబు శ్రద్ధయననొప్పు. గురూపదేశంబు చిత్తంబున దృఢంబైనదె సమాధియనదగు.

## 12. చతుర్విధ గురుసేవ

సాధన సంపన్నుండైన శిష్యునిచేత జేయందగిన గురు శుశ్రూష అంగ, ఆప్త, స్థాన, సద్భావంబులని చతుర్విధంబులై యుండు. అవియెట్లనిన గురువుల కనుకూల వృత్తియె ఆప్తంబనదగు. గురుపాద ప్రక్షాళనాదులె అంగమనదగు. గురువులగృహక్షేత్ర రక్షణాదులె స్థానమనందగు. గురువే సాక్షాత్పరశివుండను విశ్వాసంబె సద్భావంబననప్పు.

## 13. అధికార లక్షణం

కర్మకాండి భక్తికాండి జ్ఞానకాండియను ముప్వురు అధికారులుందురు. వారియందు దేహ గృహ కృత్యాదులయందు తాను నేను నాయదియను యహంకార మమకారంబు గల్గునతండె కర్మకాండి యనబడు. సకల క్రియల నీశ్వరార్పణ జేయునతండు భక్తికాండియననొప్పు. సర్వ కర్మసాక్షి తానునునతండె జ్ఞానకాండియన వెలయు. మరియు కర్మి, ముముక్షు, అభ్యాసి, యనుభవ, అరూఢులన విశిష్టాధికారులు పంచవిధులన నుందురు. వారియందు మూఢత్వంబు చేతనె తనజాతిమాత్ర కర్మంబాచరించి శత జన్మంబునకు ముక్తుండగు నతండెకర్మి. జగత్తసత్యంబని యెరింగి బాహ్య కర్మనిష్ఠాగరిష్టుండై జన్మత్రయంబునకు ముక్తుండగునతండు ముముక్షుండనదగు. స్వప్నంబునుంబోలె ప్రపంచంబు మిథ్యయని తెలిసి అభ్యంతర ధ్యానాది కర్మయుక్తుండై జన్మద్వయంబున ముక్తుండగు నతండు అభ్యాసియనదగు. వ్యహారంబుపేక్షించి వివేక తత్పరుండై యొక్క జన్మంబున ముక్తుడగు వాడు అనుభవి యనదగు. విశ్వవికృతి దోచకనె ఆత్మజ్ఞానంబు చేత సద్యోముక్తుండగు నతండారూఢుండు. మరియు జగంబనెడి కమలవల్లరీ మూలంబెద్దియను విచారంబుచేత శ్రీగురు నాశ్రయించి బ్రహ్మజ్ఞానియై మోక్షంబునొందు నతండొకానొకండు దేహాదు లనిత్యంబులని తెలిసి భోగాపేక్ష నొల్లక శ్రీగురు నాశ్రయించి తత్త్వజ్ఞానియై మోక్షంబందు నతండొకండు. మరి శ్రీగురుడు తన శిష్యులకు చెప్పుట విని అకస్మైకముగా తానుజ్ఞానియై నిర్వాణంబునొందు మహాసుకృతశాలియొకండు. ఇట్లు వివేకవిరక్తులు దైవగతిచే గలిగి ముక్తులగుదురు. ఈ ముప్వురధికారులని దెల్పిరి.



## 14. అష్టగురువులు

శ్రీగురుండె సాధకంబైన శిష్యాధికార భేదంబుచేత బోధక గురు, నిషిద్ధగురు, వేదక గురు, కామ్యకగురు, వాచకగురు, సూచకగురు, కారకగురు, విహితగురువన అష్టవిధుండైయుండు. వారియందు, శాస్త్రార్థంబుల చెప్పునతండు బోధక గురుండు, తత్త్వ దర్మకుండె వేదక గురుండు, వశ్యాకర్ష ణాదులచే ఇహమందు సుఖమున్ను పరలోకంబున దుఃఖంబును యిచ్చునతండె నిషిద్ధ గురుండు. పుణ్యకర్మోపదేశంబులచే ఇహపరంబులందు సుఖప్రదుండె కామ్యక గురుండు. వివేకమార్గంబున శమదమాదిషడ్గుణ ప్రదుండె సూచక గురుండు, విషయంబుల మిథ్యాత్వదర్శనంబుచేత నాత్మానురాగప్రదుండె వాచక గురుండు. శివజీవైక్య జ్ఞానప్రదుండు కారకగురుండు, సంశయనిరసన ద్వారా నిత్యముక్తి ప్రదుండె విహిత గురుడనదగు. మరియు సద్గురు సమీపంబు గూర్చి సచ్ఛిష్యుండెవ్వండైనను తాపత్రయాగ్నిచే గ్రాగి వ్యాకుల చిత్తుండై నేనెవడ నాకీసంసారంబెట్టి కారణంబునంగలిగె నిదియెవ్వనిచె నివర్తింపంబడు నని విచారించి చూచి పత్రపుష్పఫలాది సహపాణియై విద్యావినయ వైరాగ్యాది సద్గుణ సమేతుండగు శ్రీ గురు సన్నిధింజేరి చైతన్యం శాశ్వతం శాంతంబనునివి మొదలుగాగల యష్టమంత్ర పూర్వకంబుగా పదద్వయ కరద్వయ భుజద్వయ లలాట వక్షంబులు నేల సోకునట్లుగా ప్రణామంబొనర్చి మరిలేచి భక్తిచే కరమకలంబులు మోడ్చి కింకర భావంబుగల్గి కార్పణ్య యుక్తుండై కూరిమిచే కొనియాడి జ్ఞాన వైరాగ్య బలైశ్వర్య కీర్తి శ్రీలను సద్గుణ సమేతుండైన భగవంతుండవగు సద్గురుమూర్తికి ఆయాసంబు లేనట్లుగా నేరీతి నాకీభవబంధంబు విడిపింపదగునని విన్నపము చేయుటె శిష్యుని కర్తవ్యంబనదగు.

## 15. సద్గురూపదేశం

ప్రసన్నుండగు శిష్యుని శిష్యాధికారంబు బరీక్షించి కృపాకటాక్షంబుచే చూచి భయంబుడిపి అభయకరంబు శిరంబుపై జేర్చి శృతియుక్తులచే నాతని దేహాద్యనాత్మబుద్ధిని నేతివాక్యంబుచే పోద్రోచి నీవే పరబ్రహ్మంబవనియన్న యర్థంబు దెలుపుటే శ్రీ గురుని యుపదేశంబనదగు.

## 16. బోధత్రయం

ఆ యుపదేశ క్రమంబందలి ఉద్దేశ, లక్షణ, పరీక్ష అనునివి బోధ ప్రకారంబులు. వాటి యందవి తా సమర్థింపనిష్టమగు వస్తువును నామమాత్రంబె కీర్తింపుటె ఉద్దేశమనదగు, గంగడోలు గలిగినదె గోవనినయట్లు ఆవస్తువు యొక్క అసాధారణ ధర్మంబు జెప్పుటె లక్షణమనదగు. లక్షితమగు వస్తువుకా లక్షణంబు గలుగుటయు లేకుండుట యు విచారంబు జేయుటె పరీక్షయనదగు.

## 17. అష్ట ప్రమాణములు

ప్రత్యక్ష ప్రమాణంబు అనుమాన ప్రమాణంబు ఆగమ ప్రమాణంబు అర్థాపత్తి ప్రమాణంబు ఉపమాన ప్రమాణంబు అభావ ప్రమాణంబు సంభవ ప్రమాణంబు ఐతీహ్య ప్రమాణంబును నివి వస్తు సిద్ధికి అష్ట ప్రమాణంబులు. వీటియందు ఘటాది దర్శనంబు ప్రత్యక్ష ప్రమాణంబనదగు. ధూమంబుచేత అగ్నిజ్ఞానంబు ఆనుమాన ప్రమాణంబనదగు. మరియు ననుమాన ప్రమాణంబునకు ప్రతిజ్ఞా, హేతు, దృష్టాంతంబులను అంగత్రయంబులు గలవు. వీటియందు పర్వతంబున అగ్నిగలదనుటె ప్రతిజ్ఞయనదగు. ధూమంబుగలదైన కారణంబె హేతువనందగు. మహానసంబెట్లిట్లనుటె దృష్టాంతంబనదగు. యధార్థదృష్టార్థవాదియైన ఆప్తుని వచనంబుచె నదీ తీరాదులందు ఫలాదిసద్భావజ్ఞానంబె ఆగమ ప్రమాణంబనదగు. పగలు భోజనములేని దేవదత్తుని దేహము యొక్క పీనత్వంబుజూచి రాత్రి భోజనంబు చేయునని తెలియుటె దృష్టార్థపత్తి ప్రమాణంబనదగు, జీవితుండైన దేవదత్తుండు గృహంబున లేదనిన స్థానాంతరంబున నుండునని తెలియుటె శృతార్థాపత్తి ప్రమాణంబనదగు. గోసదృశోగవయః యనువాక్య శ్రవణానంత్తరంబున వనంబునందున్న యప్పుడు తద్విషయ జ్ఞానంబె ఉపమాన ప్రమాణంబనబడు. ఈ భూప్రదేశంబున ఘటంబు లేదనుట చేతను అఘటాభావజ్ఞానంబె అభావప్రమాణంబనదగు, సహస్ర సంఖ్య యందు శత సంఖ్య గలిగియుండునను జ్ఞానంబె సంభవ ప్రమాణంబనదగు. ఈ వటవృక్షంబున యక్షుండు గలండను లోక వాతచేతను యక్షవిషయజ్ఞానంబె ఐతిహ్య ప్రమాణంబనదగు.

మరియు నీప్రమాణములందు చార్వాకులకు ప్రత్యక్ష ప్రమాణంబొక్కటి, జైనబౌద్ధ వైషీకులకు అనుమాన ప్రమాణంబుతో గూడా రెండు, సాంఖ్యులకు ఆగమంబుతో గూడా మూడు ప్రమాణంబులు, న్యాయైకదేశులకు ఉపమానంబుతో నాల్గు ప్రమాణంబులు, ప్రాభాకరులకు ఆర్థాపత్తితోడనైదు ప్రమాణంబులు, భాట్టులకు వేదాంతులకు అభావంతోగూడి ఆరు ప్రమాణంబులు, పౌరాణికులకు సంభవంబును ఐతిహ్యంబును గూడి యెనిమిది ప్రమాణంబులు దెలియపలికె.

## 18. దృగ్దృశ్య లక్షణం

దృక్కుదృశ్యంబన రెండే పదార్థంబులు, స్వగత సజాతియ్య విజాతియ్యంబు లివి దృక్కునందు నిరాకరించదగిన భేదంబులు. వీటి దృష్టాంతరంబులు యెట్లన్నను, లోకంబున నొకానొక వృక్షంబునకు పత్ర

పుష్ప ఫలాదులే స్వగత భేదంబగు, వృక్షాంతరంబు సజాతియ్య భేదంబనందగు. పాషాణాదులే విజాతియ్య భేదంబులగు. మరియును సద్రూపబ్రహ్మంబు గగనంబెట్లట్లు నిరవయవంబౌట చాతను సత్తుకు సదంతరంబె లేదు గావునను బ్రహ్మంబునందు స్వగత భేదంబు సజాతియ్య భేదంబులు లేకయుండినను జగత్కారణంబైన మాయగలదు గావున విజాతియ్య భేదంబు యెట్లు లేదనిన, లోకంబున చిత్రకుని కంటె చిత్రశక్తికి ప్రత్యేక భావంబులేని దెట్లట్లు సన్మాత్ర బ్రహ్మంబునకంటె మాయకు విలక్షణత్వంబే లేదు గావున బ్రహ్మంబునందు విజాతియ్య భేదంబులేదనుటె సిద్ధంబు. ఈ యర్థంబున ఏకమేవాద్వితీయం బ్రహ్మయను శృతివాక్యంబునంగల ఏకం, ఏవ, అద్వితీయంబులను పదత్రయంబునకు ఐక్య అవధారణ ద్వైత నిషేంధంబులనెడి అర్థత్రయంబు గలదు గావున ఆ క్రమంబుననె బ్రహ్మంబునందు స్వగత, సజాతియ్య విజాతీయ్యంబనెడి భేదత్రయంబు లేదనుటె సత్యంబగును.

## 19. కల్పితద్వయం

అధ్యారోపం బపవాదంబను నివె కల్పిత ద్వయంబులు. వాటియందు వుండెడి రజ్జు శుక్తి స్తాణ్వాదు లందు క్రమంబుగా లేని అహి రజిత చోరాదులను కల్పించినట్లు సద్రూప బ్రహ్మంబునలేని మాయా ప్రపంచకల్పన ఆధ్యారోప మనదగు. ఇది యహిగాదు రజ్జువె, యిది రజితంబుగాదు శుక్తియె, వీడు చోరుండుగాడు స్తాణువె సరియనినట్లు, విచార ముఖంబుచేత ప్రపంచంబంతయు మిథ్య, మరి బ్రహ్మంబె సత్యంబనుటె అపవాదం బనబడును.

## 20. ఉపాయత్రయం

అతద్వ్యావృత్తి లక్షణ, తటిస్త లక్షణ, స్వరూప లక్షణంబులనెడిదే దృగ్రూప వస్తు సాక్షాత్కారంబున కుపాయత్రయంబు దానియందు దేహద్యనాత్మ



వగంబుల యుక్తిచేత నేతి ముఖంబున నిషేధించి ఆత్మని దెలుపుటె అతద్వ్యావృత్తి లక్షణంబగు. శాఖాగ్రంబున చంద్రని దెలుపునట్లు భూతాది జగత్కారణ త్వంబుచేత ఆత్మని దెలుపుటె తటిస్త లక్షణం బనదగు. ప్రకృష్ట ప్రకాశరూపుండె సూర్యుండన్నట్లు యాత్మ నిజస్తితి దెలుపుటె స్వరూపలక్షణం బగును.

## 21. ఆత్మస్వరూప పంచలక్షణం

సత్తు చిత్తు ఆనంద నిత్య పరిపూర్ణంబులనునివె యాత్మని స్వరూప లక్షణంబులు. వాటియందు యెరుగుదు, నెరుంగ, నెరింగితి యనునప్పుడు కామాదివృత్తులు దోచునప్పుడు దిక్కుతోచకుండు నప్పుడును జాగ్రతాద్యవస్థలయందున్ను తనకొక్క బాధయు లేక యుండుటె సద్రూపంబగు. సప్తావస్తలయందు విషయంబుల నెదుర్కొని దృశ్యంబుగా జూచినది చిద్రూపంబగు. పరమ ప్రీతికి విషయమై యుండునదె ఆనంద రూపంబగు. సతతోదితమై యుండినదె నిత్యరూపంబగు. సర్వార్థ సాధకంబగుటచేతను సర్వ సంబంధిత్వంబె పూర్ణరూపంబగును.

మరియు నీయర్థంబున సచ్చిదానందంబు లాత్మస్వరూపంబులై యుండ సద్రూప చిద్రూపంబులట్ల సర్వబుద్ధి వృత్తులయందును ఆనంద రూపంబునకు అభివ్యక్తి గలుగవలయునది లేదుగావున ఆనందంబాత్మ స్వరూపంబు గాదను శంకకు ఉష్ణప్రకాశ రూపంబగు దీపంబు యొక్క ప్రకాశంబె గృహంబునను వ్యాపించు వుష్ణంబు వ్యాపకంబుగానేరదు. వుదకంబున వుష్ణంబె ప్రకటమగుచుండు ప్రకాశంబునకు ప్రకటంబులేదు. కాష్టంబునందు వుష్ణ ప్రకాశంబులు రెండు గలుగు టెట్లట్లు పాషాణాదులయందు బ్రహ్మయొక్క సద్రూపంబున కభివ్యక్తి గలదు. చిదానందంబుల కభివ్యక్తి గానేరదు. బుద్ధియొక్క తమోగుణంబుచే

అజ్ఞానమయంబగు మూఢవృత్తి యందును రజోగుణంబుచే రాగమయంబగు ఘోరవృత్తి యందును సచ్చిద్రూపంబులనెడి రెంటికి స్పష్టత్వంబుగాని ఆనంద రూపంబునకు స్పష్టత్వంబు గలుగనేరదు, సత్వ గుణంబుచె వైరాగ్యమయంబైన శాంత వృత్తి యందె సచ్చిదానందంబులను త్రిరూపంబులకు స్ఫురణ గలుగు గావున ఆనందంబాత్మ స్వరూపంబనుట సిద్ధంబు.

## 22. సత్తత్రయం

క్రమంబుగా పంచరూపంబులకు ఉపాధిచే భేదం బెట్లనిన వ్యావహారికసత్త ప్రాతిభాసికసత్త పారమార్థికసత్తలనునవి సత్తాత్రయంబు, దీని యందు జాగ్రత్తున ఘటాదుల సత్తే విదేహకైవల్య పర్యంతంబు సుప్తి మూర్ఛాద్యవస్థల దోచక యుండి పిదపలేచి చూచినను మొదలయట్ల దోచుచుండగావున వ్యావహారిక సత్తయనదగు. శుక్తికా రజిత స్వప్న విషయాదుల సత్తె ఆతోచు కాలంబుననెగాని హెచ్చరిక గలిగి మరియు దోచు స్వప్నంబున లేదుగావున ప్రాతిభాసిక సత్తయనదగు. సమస్త కల్పనలకధిష్ఠానంబై తోచక లయంబు నొందక నిలచిన బ్రహ్మసత్తె పారమార్థిక సత్తయనబడును.

## 23. చిత్తుచతుర్విధం

జీవేశ్వర కూటస్థబ్రహ్మలనునవి చిత్తుచతుర్విధ భేదంబులు. వాటికి ఘటజలంబున ప్రతిబింబించిన నాభ్ర నక్షత్రాకాశంబును, మేఘాంశతుషార జలంబున ప్రతిబింబించిన మిత్తాకాశంబును, ఘటావఛిన్నాకాశంబును, మహాకాశంబును నివి క్రమంబుగా దృష్టాంత చతుష్టయంబగు.

## 24. ఆనందాష్టకం

విషయానంద, బ్రహ్మానంద, వాసనానంద, ముఖ్యానంద, నిజానంద, ఆత్మానంద, అద్వైతానంద, విద్యానందంబు లనెడివే ఆనందాష్టభేదంబులు.



వీటియందు వనితాది విషయలాభం బైనంతట తోచినదే విషయానందమగు. నిద్రసమయమందె తోచినదే బ్రహ్మానందంబగు. హానో పాదనంబులేని ఉపేక్షా బుద్ధియందు తోచినదె ముఖ్యానందంబు. యోగాభ్యాస బలంబున మనోలయంబైనప్పుడు తోచినదె నిజానందమనదగు. ప్రియ వనితాది విషయంబులందు తానె ప్రియతముండని యెరిగినప్పుడుతోచినదె ఆత్మానందంబగు. నామరూప ప్రపంచంబంతయు మిథ్య, తానె సత్యంబను వివేకంబునందు దోచినదె అద్వైతానందంబనదగు. తత్వమస్యాది మహావాక్య జనితాపరోక్ష జ్ఞానంబునందు దోచినదె విద్యానందంబనదగు.

## 25. అభావచతుష్టయం

ప్రాగాభావ, ప్రధ్వంసాభావ, అన్యోన్యాభావ, అత్యంతాభావంబులనునివి బ్రహ్మయొక్క నిత్యపదంబున్‌దోచు అభావ చతుష్టయము. వీటియందు మృత్తికమొదలగు వాటియందు ఘటాదికంబులు మొదలు లేదనుటె ప్రాగాభావంబనదగు. పుట్టినఘటంబు భిన్నంబైన మరిలేదనుటె ప్రధ్వంసాభావం బనదగు. ఘటమందు పటంబును పటమందు ఘటంబును లేదనుటె అన్యోన్యాభవంబనబడు. గగన కుసుమాదులె అత్యంతా భావంబనదగు.

## 26. పరిచ్ఛేదత్రయం

కాలపరిచ్ఛేద, దేశపరిచ్ఛేద, వస్తు పరిచ్ఛేదములను నివిబ్రహ్మయొక్క పూర్ణపదంబు నందు నివారింపందగిన పరిచ్ఛేద త్రయంబు, వాటియందు యొక్క దేశంబునంగల డొక్కదేశంబున లేదనునదె దేశ పరిచ్ఛేదంబనదగు. యొక కాలంబున గల డొక్కకాలంబు లేదనుటె కాలపరిచ్ఛేదంబున నొప్పు. నొక వస్తువిదగు నొక వస్తువిది కాదనుటె వస్తు పరిచ్ఛేదమన వెలయు.

## 27. జీవనామరూప వ్యవహారం

పూర్వోక్త చిద్రూప భేదమైన జీవేశ్వరాది చతుష్టయంబునకు క్రమంబుగా నామాది వ్యవహారకల్పన లెట్లనిన, మొదలు జీవుండె విశ్వతైజస ప్రాజ్ఞులని త్రివిధం బైయుండు. వానిలో స్థూలశరీర వ్యష్ట్యభిమాని వ్యావహారిక జీవుండు. బుద్ధి ప్రతిఫలిత చైతన్యుండు చిదాభాసుండు. క్షేత్ర, శరీర, ప్రమాతృ, కర్త, భోక్త, సంసారి, విషయ, పరాగాత్ముండు, విజ్ఞానమయుండు, త్వంపద మబాధుండ మనునివి మొదలైనవె విశ్వపర్యాయ నామంబులగు. మరియు సూక్ష్మశరీర వ్యష్ట్యభిమాని ప్రాతిభాసిక జీవుండు, స్వప్న కల్పితుండనునివి మొదలయినవె తైజనుని పర్యాయ నామంబులు. మరియు కారణశరీర వ్యష్ట్యభిమాని, అవిద్యోపాధికుండు, కార్యోపాధికుండనునవి మొదలయినవె ప్రాజ్ఞుని పర్యాయ నామంబులు.

## 28. ఆత్మత్రయం

జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మలనెడివె ఆత్మత్రయంబు. వాటియందు తప్తాయః పిండంబువలెనె దేహంబులతోడ సంబంధములచె సకల సంసార వ్యవహారంబు గల యతండె జీవాత్మయగు. కమల పత్రోదకంబువలెనె జీవుని సంసారంబు పొందియు, పొందని యతండె అంతరాత్ముండు. లోక వ్యవహారంబునకు సూర్యుండెట్లట్లు జీవాంతరాత్ముల వ్యావహారిక సాక్షియె పరమాత్మయనదగు.

## 29. సంసారకల్పన

జలంబున సూర్యుండు గదలెనన్నట్లు, నదియందు ఓడ నడిచినయడ తీరమందలి తరువులందు చలంబు దోచినట్లు, మేఘచయంబుల ధావనంబు



చంద్రునిదన్నట్లు, గవాక్షత సూర్యాతపంబున హస్త చలనంబుచె ఆతప చలనంబనినట్లు, దేహ జనన మరణంబులు ఆత్మునికన్నట్లు నిర్వికారుండగు నాత్మునకు దేహాద్యుపాధులచేనైన జీవావస్థయే సంసార వ్యవహారంబు.

## 30. ఈశ్వర నామరూప వ్యవహారం

ఈశ్వరుండె విరాట్పురుష, హిరణ్యగర్భ, అంతర్యాములని త్రివిధుండై యుండు. వానిలో స్థూల శరీర సమష్ట్యభిమాని, వైశ్వానరుండను నిదియాదిగా గల్గినవె విరాట్పురుషుని పర్యాయ నామంబులు. లింగశరీర సమష్ట్యభిమాని, మహాప్రాణుండు, సూత్రాత్మకుండను నివి మొదలయినవె హిరణ్యగర్భుని పర్యాయ నామంబులు. కారణశరీర సమష్ట్యభిమాని, అజ్ఞానోపహి తచైతన్యుండు, కారణోపాధికుండు, మాయోపాధికుండు, మాయాభాసుండు, మాయావి, జగద్యోని, ఆనందమయుండు, అక్షరుండు, అవ్యక్తుండు, అవ్యాకృతుండు, శబల బ్రహ్మంబు, సగుణ బ్రహ్మంబు, పరముండు, పరదేవత, తత్పద ముఖ్యార్థుండను నివి మొదలయినవె అంతర్యామి పర్యాయ నామంబులు. ఈశ్వరుని త్రివిధత్వంబునందు దృష్టాంతంబెట్లనిన, ఎట్లు చిత్రపటంబు ద్రవ్యాంతర సంబంధంబు లేకయుండ తానె ధౌతమనిపించుకొను చరిచేత ననులేపనంబుగావించిన ఘట్టితంబనబడు. నీలీమయాకృతులచె లాంఛితమనదగు. పిదప యధాయోగ్యంబైన వర్ణ పూరణంబులచేత రంజితమనదగు. అట్లు పరబ్రహ్మంబు మొదలు మాయా తత్కార్య రహితుండనునతండె చిత్తన వెలుంగుచుండు.

మరియు సర్వ కారణంబైన మాయోపాధిచేత అంతర్యామి యనుపించుకొనును. అవ్యక్తంబై అపంచీకృత భూతకార్యంబైన సూక్ష్మసమష్ట్యు పాధిచె సూత్రాత్మకుం డనిపించుకొనును. పిదప వ్యక్తంబైన

పంచీకరింపంబడిన భూతకార్యరూప స్థూలశరీర సమష్ట్యుపాధిచె విరాట్టనుపించుకొనును. మరి యిచట బ్రహ్మంబునకు చిత్రపట దృష్టాంతంబు చెప్ప చిత్రంబులేవేవనిన విరించ్యాది తృణాంతంబగు చేతన ప్రాణులును గిరి నద్యా ద్యచేతన విషయంబులైన జడాజడ రూపంబగు జగత్తె చిత్ర దృష్టాంతంబగు. మరియు పారమార్థికంబైన చిద్రూపాద్వయ బ్రహ్మంబునందు మిథ్యాత్మక బహు చేతనాచేతన జగత్తుదోచు టెట్లనిన యట్లు చిత్రంబులో వ్రాయంబడిన మనుష్యులు కట్టికప్పిన నానావర్ణోపేతంబైన శీతాదినివృత్తిని చేయ నసమర్థంబైన వస్త్రాభాసంబులు ఏకాకారమైన శీతాది పరిహారకంబై తథ్యంబైన ఆ యాధార పటంబుతో సదృశంబులైయుండు. ఆ చిత్రంబునంగల గిరి నద్యాదులకా చిత్రాధారపటంబుతోడ పోలిక ఘటింపనేరదు. ఆ విధంబుననే చిద్రూప బ్రహ్మంబునందు భిన్న భిన్నంబుగా దోచుచుండెడి వ్యావహారిక జీవులె చిత్తునందు పోలికెగలిగి చిదాభాస చేతనలనబడిరి. చిత్తునందు పోలికె ఘటించని మృత్తిక మొదలైనవె జడరూపంబు లౌటచేత చేతనా చేత నాత్మకజగత్తు చిద్రూప బ్రహ్మంబునందె కల్పితంబని తెలియంబలికె.

## 31. ఈశ్వర ముఖ్యగుణములు

సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ, సర్వనియంతృత్వ, సర్వాంతర్యామిత్వ, సర్వాత్మకత్వ, సర్వశక్తిత్వాదులే యీశ్వరుని ముఖ్య గుణంబులు. కర్తృత్వ, అకర్తృత్వ, అన్యథాకర్తృత్వంబనెడిదె యీశ్వరుని ప్రభుత్వ సామర్థ్యత్రయంబు.

## 32. ఈశ్వరుని పంచకృత్యములు

సృష్టి, స్థితి, సంహార, నియామన, అనుప్రవేశంబులను నివె యీశ్వరుని పంచకృత్యంబులు. మరియు నిర్వికారత్వంబు చేత, నద్వితీయ్య బ్రహ్మస్వరూపంబైన యీశ్వరుని యందు సృష్ట్యాది బహుకృత్యం బెట్లు ఘటించుననిన, యట్లుసూర్యుండు యిచ్ఛాయత్నాదికంబులేక తనవృష కిరణంబులచేత వృష్టిరూప జలంబు గురిపించి, ఆ జలంబునందు ప్రతిబింబ రూపంబుచేతనె ప్రవేశించి, మేఘాదికంబుచె ఆ జల ప్రతిబింబంబును మరుగుజేసి, హిమకిరణాదులచేత జల ప్రతిబింబంబు దడసి ఉష్ణకిరణంబులచేత ఆ జలంబులబీల్చి, తన ప్రతిబింబంబు తనలో గల్పు కొనునట్లు మహేశ్వరుండు తనమాయా శక్తితో గూడి చిత్ప్రధానత్వంబుచె నిమిత్త కారణుండై, జడ ప్రధానత్వంబుచేత ఉపాదాన కారణుండనిపించి, బుద్ధ్యాదికార్యంబుల సృజించి, జీవరూపంబుచేత తానె ప్రవేశించి, కర్మంబుచే భోక్తృ వనిపించి, నియామక శక్తి చేత నాభోగ్య భోక్తృవుల నియమించి, రుద్రరూపంబుచేత నట్టికార్యం బుపసంహరించి, మరి శృత్యాచార్య రూపంబుచే జీవుని తనలో నైక్యంబు గావించికొనుననుటె సత్యంబగు.

## 33. రూపద్వయం

సమిష్టి, వ్యష్టియను నివే జీవేశ్వర విభాగోపాయ ద్వయంబు. వాటియందు అనేక వృక్షంబులు గల వనంబొక్కటె యని తెలియునట్లు అనేక జీవుల తన ఆత్మయను యభిమానం బీశ్వరునకు సమిష్టిరూపంబగు. ఇది యొక్క వృక్షం బిదియొక్క వృక్షంబని భిన్న భిన్నంబులుగా లక్షించినట్టుల ప్రత్యేక ప్రత్యేక దేహాభిమానంబె జీవునకు వ్యష్టిరూపంబగు.

## 34. కూటస్థ పర్యాయ నామములు

విశ్వాది జీవత్రయాధిష్ఠాన చైతన్యుండు, తురీయ్యుండు, స్వయంశబ్దార్థుండు, సాక్షియు, పారమార్థిక జీవుండు, త్వంపదస్థాలక్ష్యార్థుండు

అనునివి మొదలయినవే కూటస్థపర్యాయ నామంబులు.

## 35. బ్రహ్మ యొక్క పర్యాయ నామములు

అంతర్యామి, ముఖ్యేశ్వరత్రయాధిష్టాతృ, పరబ్రహ్మంబు, పరమాత్మ, సర్వాధిష్టాతృ, విశుద్ధచిత్తు, తత్పద లక్ష్యార్థంబను నివి యాదిగా గల్గినవే బ్రహ్మ పర్యాయ నామంబులు.

## 36. దృగ్వివేకం

మృత్తిక యొక్కటె నామరూపంబులచేత ఘటాది బహుభేదంబైనట్లు, దీపమొక్కటె ఘటాది వివరంబులచేత బహుత్వంబు గల్గియున్నట్లు, మారుత మొక్కటె వంశరంధ్రంబుల మధురమంద్రాది విభిన్నంబైనట్లు, స్వరమొక్కటె గాయకుని కరణవృత్తి చేత నానారాగంబైనట్లు, గగన మొక్కటె గృహాద్యుపాధిచె యనేకంబైనట్లు, ధ్వని యొక్క వాద్యభేదంబుచే యనేకంబైనయట్లు, సువర్ణ మొక్కటె వాచాభృణంబుచే కటకమకుటాది బహుభూషణంబైన యట్లు, జలమొక్కటె వాయువశంబున ఫేనతరంగాది సముదాయంబైనట్లు, సభయొకటె కదళీమండాది ఛిద్రంబులందు కరితురగాది విచిత్రంబుగా దోచినట్లు, రవిచంద్రాదులు జలకుంభాదులందు అనేకులై దోచినట్లు, లెక్కవక్కటె బహు బిందువులచేత దశశత సహస్రాదులయినట్లు, చిత్తొక్కటియందు పూర్వోక్త జీవేశ్వరాది ఖేద వ్యవహారంబులు కల్గెననునివి మొదలైనవె దృగ్వివేకంబని తెలియందగును.

## 37. దృశ్య వివేకం

అనాదిగా చంద్రునికళంకంబు చంద్రునె కమ్మి చంద్రుని యాఛ్ఛాదనంబు చాయనోపక చంద్రునిచె తానె వెలుంగుచు యుండునట్లు. నన్ను నేనెరుంగ నను లోకప్రసిద్ధమైన వ్యవహారంబు తోచక స్ఫోటకాది



కార్యగమ్యయై అందు ఆత్మని నమ్మి ఆత్మని ఆచ్ఛాదింపకనె ఆత్మనిచె తెలిపింప చేసుకొనుచూ నుండుగావున యట్లు, అగ్ని యొక్క దాహక శక్తి మరి మణిమంత్రాది ప్రయోగంబుచేత తానె బంధింపబడు చుండుట వల్ల అగ్ని స్వరూపంబుగాక అగ్నిని విడిచి తోచక స్ఫోటకాది కార్యగమ్యయై యుండునట్లు, బ్రహ్మస్వరూపంబుగాకయు బ్రహ్మ విలక్షణంబుగా దోచక వియదాది కార్యగమ్యంబై అఘటితఘటనా సమర్థంబై సర్వానర్థంబునకు కారణంబైయుండునదె దృశ్యరూపమాయాశక్తి యనందగు.

## 38. మాయాలక్షణ పంచకం

అసత్, జడ, దుఃఖ, అనిత్య, ఖండితంబులనెడివె మాయా పంచలక్షణంబులు. వాటి యందు శశ విషాణాదికంబె అసద్రూపంబు, పాషాణాదులె జడరూపంబు, రజస్తమోమయంబైన బుద్ధి యొక్క ఘోర మూఢవృత్త్యాదులె దుఃఖరూపములు, వుండిపొయ్యెడి దేహాదులె అనిత్య రూపము, కాలపరిచ్ఛేదాదులె ఖండిత రూపమనందగు.

## 39. మాయా నిర్వాచ్య నవప్రకారం

భిన్న, భిన్నాభిన్న, అభిన్న, సత్తు, అసత్తు, సదసత్తు, సావయవ, నిరవయవ, సావయవనిరవయవంబును కాదనుటె మాయా నిర్వాచ్య నవప్రకారంబులు. మరియు మాయయే లోకసంబంధజ్ఞాన యుక్తి సంబంధజ్ఞాన, శృతీసంబంధజ్ఞానములను జ్ఞానత్రయంబుచేత క్రమంబుగా గగన కుసుమంబట్ల తుచ్ఛంబనదగి. శుక్తికారజితం బట్ల నిర్వాచ్యంబై, ఆత్మనియట్లు నిత్యంబనబడు.

## 40. మాయానామపంచకం

తమస్సు, మాయ, మోహం, అవిద్య, అనృతాత్మిక యనునివె మాయాపంచకంబు. వాటియందు జీవచైతన్యం బాఛ్ఛాదించుట చేత తమస్సుఅనబడు. జగద్రూపంబై అన్యధా తోచుటకు కారణంబగుటచే మాయయనబడు. ఆ తోచిన జగత్తునందు శుక్తి రజితాది విపరీత జ్ఞానంబు బుట్టించుటచేత మోహమనిపించుకొనును. విద్య నష్టంబగు గావున అవిద్యయనంబడు. సద్రూపంబునకంటె అన్యంబౌట అనృతాత్మిక యనదగు. మరియు సంకోచ వికాసంబులనునివె మాయాధర్మద్వయంబు. వాటియందు యట్లు చిత్రపటంబు తన ప్రసరణంబుచేత చిత్రంబుల గనుపింపంజేశి సంకోచంబుచేత చిత్రంబుల తిరోధానంబు చేయునట్లు మాయ తన వికాస ధర్మంబుచే ప్రపంచ విస్తారంబు జూపి సంకోచ ధర్మంబుచే నది యడంగించుచు నుండును.

## 41. మాయాగుణద్వయం

స్వతంత్ర, అస్వతంత్రతయను రెండు మాయాగుణంబులు. వాటియందు మాయ మిథ్యయౌటచేతను, సద్రూపచైతన్యంబు విడిచితోచుటకు సమర్థంబుగాదు గావున అస్వతంత్రయైయుండు. సాక్షికుడైన యసంగమ యుండగు నాత్ముని జీవాది ప్రపంచమయునిగా జేయుటె స్వతంత్రయనదగు మరియు మిథ్యయనుటెట్లనిన గగన కుసుమంబట్ల సర్వదా శూన్యంబనుటగాదు. మరి యెట్లనిన స్వప్న గజంబువలె దోచుచు విచారా బాధితంబగు నెద మిథ్యయనదగు.

## 42. మాయావృత్తిత్రయం

విశుద్ధ సత్వరూపమాయ, మలిన సత్వరూపావిద్య, తమః ప్రధానరూప ప్రకృతియనునివి మాయావృత్తి త్రయంబు. వాటియందు



మాయయె సుప్తియందు పరబ్రహ్మంబుతోడ నధ్యాసైక్యంబై యుండి, స్వప్న జాగ్రత్తులయందు కించిదాద్య వస్తులంబొందు చున్నప్పుడా బ్రహ్మచైతన్యంబు దానియందు ప్రతిఫలించి, సర్వజ్ఞత్వాదిగుణ విశిష్టచైతన్యుండైన యీశ్వరుం డనుపించి, ప్రతిపదంబున ప్రేరయితనుపించుకొనుట చేతను, ఆ మాయ ఈశ్వరున కుపాధియైయ్యు, అమోహకారణి యనుపించు కొనియుండు. మరియు నా యవిద్యయె నానాత్వంబుచేత భోక్తృవైన పశు పదార్థంబునదగిన జీవుల కుపాధదియై మోహింపజేయు చుండును. మరియు నాప్రకృతియె భోగ్యాత్మకత్వంబుచేత పాశపదార్థంబనదగి, గుణత్రయ సమానావస్థచే యుండి, అవిద్యయందు ప్రవేశించి యుండెడు జీవుల భోగార్థంబుగా సకల కార్యంబౌటకై యీశ్వరసన్నిధాన క్షణమాత్రంబుచే చలరేగి, మొదలు కాలతత్వంబు వడశి, మీద నాకాలవశంబుచే పరిణమించి, మహత్తత్వమను పించుకొను నమ్మహత్తత్వ మెట్లనిన విత్తిన విత్తనంబు అంకురింపక పూర్వ రూపంబును గాక వుఘూనావస్థం బొందుచందంబున కారణ ప్రకృతి గాకనె కరణంబు అయిన యహంకారంబునుం గాక మిథ్యాజ్ఞాన నిర్వికల్ప రూపంబుచే మధ్యావస్తయనబడు. మరియు నమ్మహత్తత్వంబుచేత గుణభేదంబు గలిగి మిథ్యాజ్ఞాన సవికల్ప రూపంబైన ప్రథమాధ్యాసంబున నొప్పెడి మూలాహంకారంబు జెనించుచుండు.

## 43. గుణత్రయం

సత్వగుణ, రజోగుణ, తమోగుణంబులనెడిదె గుణత్రయంబు. ప్రకాశ, ప్రవృత్తి, మోహంబులనునివె సత్వాదిగుణరూపంబులు. వైకారిక, తైజస, భూతాదులనునివి సత్వాది గుణపర్యాయ నామంబులు. వాటియందు సత్వగుణంబుచె మానసాద్యంతఃకరణంబులును శ్రోత్రాది జ్ఞానేంద్రియ పంచకంబును గలిగె. రజోగుణంబున వాగాదికర్మేంద్రియ పంచకంబును

ప్రాణాదివాయు పంచకంబునుంబుట్టె. తమోగుణంబుచే ఆకాశాది భూత పంచకంబుదయించె. భూతంబుల పంచీకరణ మేళనంబుచె బ్రహ్మాండ భువన శరీర ఘటాది విషయంబులుం జనించె.

## 44. ఇంద్రియములు

మానసాద్యంతఃకరణంబులకు క్రమంబుగా విషయంబుల తలంచుట, నిశ్చయించుట, అభిమానించుట, అవధరించుట యనుటె వ్యాపారంబులు. చంద్ర, చతుర్ముఖ, క్షేత్రజ్ఞ, త్రిపురాంతకులె అధి దేవతలు హృదయాది గోళకంబులె స్థానంబులు. శ్రోత్రాది జ్ఞానేంద్రియంబులకు క్రమంబుగా శబ్దాది విషయంబుల వినుట సోకుట, రుచించుట, వాసనగొనుటలె వ్యాపారంబులు. దిక్, మారుత, మిత్ర, వరుణ, అశ్వినులె అధి దేవతలు. కణాదిగోళకంబులె స్థానంబులు. శ్రోత్రాదీంద్రియములకు బాహ్యంబుల యందు విషయంబుల గ్రహించునట్ల అంగుళిచేత శ్రోత్రంబులు మూయగా ప్రాణవాయువు జఠరాగ్ని యందు గల శబ్ద గ్రహణంబును, నేత్రంబులు మూయగా లోపలి యంధకార రూపంబు గ్రహించుటయు, అన్నపాన స్వీకారముల యందు ఉష్ణ శీతస్పర్శనంబున గ్రహణంబును, ఉద్గారణంబై నపుడు రసగంధ గ్రహణంబును, అంతర శబ్దాది విషయ గ్రహణంబులు గలదనుటె సిద్ధంబు. మరియు వాగాది కర్మేంద్రియంబులకు క్రమంబుగా పలుకుట, పట్టుట, నడచుట, విడచుట, ఆనందంబు బుట్టించుట యనునవి యీ వ్యాపారంబులు. అగ్ని, ఇంద్ర, హరి, మృత్యు, ప్రజేశ్వరులనువా రధిదేవతలు. ముఖాది గోళకంబులె స్థానంబులగు. అంతఃకరణ జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబులను నివి చతుర్ధశ ఆధ్యాత్మికంబులు. వాటి విషయంబులె అధి భౌతికంబులు. వాటి యధిదేవతలె ఆధి దైవతంబులని తెలియందగు. మరియు నింద్రియాది దైవతంబులె విరాట్పురుషుని ఇంద్రియంబులు. ఆ ఇంద్రియంబులె హిరణ్య గర్భునిశరీరంబు. ఆ శరీరంబే తమో రూపంబై అంతర్యామియై కారణంబైయుండు.

## 45. వాయువులు

ప్రాణవాయువు హృదయ స్థానంబున నుండి వుఛ్వాస నిశ్వాసంబులు జేయు. ఆపాన వాయువు గుదస్థానంబుననుండి మలమూత్రంబులం త్యజింపుచుండు. సమాన వాయువు నాభిస్థానంబున నుండి భుజించిన యన్నరసంబు సర్వాంగంబులకుం పంచిపెట్టు. ఉదాన వాయువు కంఠస్థానంబున నుండి వుఛ్వాస నిశ్వాసంబులచె ఉద్గారంబు జేయుచుండు. వ్యానవాయువు సర్వాంగంబుల యందుండి దేహంబు ధరియించి యుండు. పిదప నాగ వాయువుచె దేహంబు బిగువుడుపుట, ఆవలించుట గలుగును. కూర్మవాయువుచే త్రేన్పు వెక్కిళ్ళు గలుగును. కృకర వాయువుచే తుమ్ము దగ్గులు గల్గును. దేవదత్తవాయువుచే నవ్వు, మాటయు గలుగును. ధనంజయ వాయువుచే శోక రాగంబగు. నా ధనుంజయ వాయువు మృతంబైన అయిదునాళ్ళు విడవకయుండి దేహంబుబ్బి బగలంజేసి పోవును. మరియు నాగాది వాయువులు బాహ్యవాయులనదగి, వాగాది కర్మేంద్రియ చేష్టా హేతువు లయ్యుండు, ప్రాణాదివాయువులె శోత్రాది జ్ఞానేంద్రియ చేష్టా హితువులయ్యుండు. వైరంభ, ముఖ్య, ప్రభంజన, అంత్తర్యామి సౌజ్ఞలు గల నాల్గు జీవసంబంధమైన వాయువుల మానసాద్యంతఃకరణ చేష్టకారణంబై యుండు.

## 46. భూతంబులు

పూర్వోక్త భూతంబులకు క్రమంబుగా ధారణ, పిండీకరణ, పాక, వ్యూహ, అవకాశంబులను నివి వ్యాపారంబులు. బ్రహ్మ విష్ణు రుద్ర యీశ్వర

వివేక చింతామణి వచనము

సదాశివులను వారలధి దేవతులు. గంధాదులె గుణంబులు. మరియు నా భూత గుణంబులయందు ఆకాశంబులకు నొక్క గుణంబు, వాయువునకు రెండు, అగ్నికి మూడు, వుదకంబునకునాల్గు, భూమి కైదు గుణంబులు. వాటిభేదంబులెట్లనిన ఆకాశంబునకు ప్రతిధ్వని గుణంబొక్కటి. వాయువునకు విస్సను శబ్దంబును, వుష్ణ శీత స్పర్శన మనెడి గుణంబులు రెండు. అగ్నికి భుగభుగన శబ్దంబు, పుష్ణ స్పర్శ, ప్రభా రూపంబులను గుణంబులు మూడు. జలంబునకు బుళబుళను శబ్దంబు, శీత స్పర్శ, శ్వేత రూప, మధుర రసంబులను గుణంబులునాల్గు. భూమికి గడగడను శబ్దంబు, కఠిన స్పర్శ, నీలాది విచిత్రరూపు, మధురావ్లాది నానా రసంబులు, సుగంధ దుర్గంధములనెడి గుణంబులు ఐదు.

## 47. త్రిపుటి

ఇట్లు విభాగించి చెప్పి, పిదప జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయంబులనునివి త్రిపుటి యనదగు. వాటియందు మూలాహంకారంబునందు ప్రతిఫలించిన జీవ చైతన్యంబె జ్ఞాతృవనబడు. మనంబునందు ప్రతిఫలించిన జీవ చైతన్యంబె జ్ఞానమనంబడు. భూత భౌతిక విషయంబులె జ్ఞేయమనబడు. మరి యిచట మనస్సె యిరువది నాల్గు తత్త్వంబులు. మూలాహంకారంబె యిరువదైదోదగు. అహంకార గత చిదాభాసజీవుండె షడ్వింశకుండగును. మాయోపాధికుండైన యీశ్వరుండె సప్తవింశకుండనబడు. ఆ యహంకార జీవులకు అధిష్ఠానమైన కూటస్థుండె అష్టవింశకుండనబడు. ఆ మాయా యీశ్వరుల కధిష్ఠానమైన బ్రహ్మంబె యిరువైతొమ్మిదో దగును.

## 48. ప్రకృతి కార్యోదయద్వయం

ప్రకృతిచే కార్యోదయంబెట్లనిన క్రమసృష్టియని, యుగవత్సృష్టియని ద్విప్రకారంబులు. వాటియందు మూల ప్రకృతిచేత మహత్తత్వంబు అహంకారంబు తన్మాత్రపంచకంబులను నివి సప్త ప్రకృతులు. వాటిచే పంచభూతముల యందున బ్రహ్మాండ దేహ ఘటాది ప్రపంచోదయంబె క్రమసృష్టియనదగు. నిస్తరంగ సముద్రమందు వొక్కకాలంబున వాయువశంబుచే విచిత్ర ఫేన తరంగ బుద్బుదాదు లుదయించినట్లు సచ్చిదానందాత్మక బ్రహ్మంబునందు మాయామయి నామరూప ప్రసరంబును, యుగ వత్సృష్టి యగు. ఈ ద్వివిధంబును శృతిసిద్ధంబౌటచే నిశ్చయంబగు. అతిరోహిత బ్రహ్మస్వరూపుండగుటచే వికారంబులేని యీశ్వరునిచేత జడ ప్రకృతియందు కార్యోదయంబెట్లనిన యిచ్చాదికంబులేని సూర్యునిచే యత్నాదికంబులేని సూర్యకాంతంబునందు వహ్నియుద్భవించినట్లు పరశివునిచాత ప్రకృతియందు మహదాది కార్యోదయంబునకు విరోధంబు లేదు.

## 49. మాయాకార్యోదయ చతుష్టయం

వృత్తి, పరిణామ, ఆరంభ, వివర్తములని కార్యోదయంబు చతుర్విధంబైయుండు. వాటికి పట కుటీ భావ, క్షీరద ధ్యాకార, తంతు పట న్యాయ, రజ్జు సర్ప న్యాయంబులను నివిక్రమంబుగా దృష్టాంత చతుష్టయంబగు. రజ్జు సర్ప, స్థాణు చోర, స్వప్నేంద్రజాల, గంధర్వనగర, శుక్తికా రజిత, నీల నభో, మరీచికా జలంబులను నివి మొదలుగా గల్గినవె సద్రూప వస్తువందు మిథ్యావస్తు కల్పనంబునకు దృష్టాంతంబులగు. మరియు నిచట నిర్వికార స్వరూపంబుచేత అద్వయుండగు ఆత్మునియందు మిథ్యా వస్తు కల్పితంబెట్లనిన.

మొదలు భ్రాంతియవ్వనికి తోచెననిన వినుము. ఒకానొక యతీశ్వరునకు సతి పతి రతి కాంక్షయను త్రివిధ రూప స్వప్నంబేక కాలంబున

దోచగా నందుచే నతనికి యే హానియు లేనియట్లు సాక్షికుండగు యాత్మునియందు గుణత్రయాత్మక ప్రకృతీ భ్రాంతినొందు జ్ఞాతృ భ్రాంతి, జ్ఞాన భ్రాంతి, విషయ జ్ఞేయము లనెడి త్రిపుటీమయ ప్రపంచంబేక కాలంబునందె కల్పితంబైనను, ఆత్మునకు నే హానియు లేదనుటె నిశ్చయంబు.

## 50. విషయత్రయం

ఈశ్వరునిచె స్పష్టంబగు మాయామయ వ్యోమాది ప్రపంచంబు తన స్వరూపంబుచేత నొక చందంబున నుండు దానియందు జీవుని బుద్ధి వృద్ధి కల్పితంబైన వేరొక్క భోగ్య స్వరూపంబె ప్రీతివిషయంబని, ద్వేషవిషయంబని, ఉపేక్షా విషయంబని త్రివిధంబైయుండు. వాటియందు వనితాది విషయంబె ప్రీతి విషయంబగు. వ్యాఘ్రాదికములే ద్వేషవిషయములగు. వీధి తృణాదులే ఉపేక్షా విషయంబనదగు. మరి యా విషయంబుందొక్కటియందు యీశ్వర నిర్మితంబైన ఏకాకారత్వంబును, జీవకల్పితంబైన యనేకాకారత్వంబును యుండునందుకు దృష్టాంతంబెట్లనిన, యీశ్వర నిర్మితంబులైన రత్నాది వస్తువులు తానొక్క ప్రకారంబుగా నుండుచుండు. మరిభోక్తృవుల బుద్ధి వృత్తి కల్పిత, నానాత్వంబుచే నా రత్నాదికంబె తమ్ము బొందు పురుషునకు ప్రీతి విషయంబగుచుండు. బొందనివారికి ద్వేషవిషయమగు. విరక్తుండగు వానికి ఉపేక్షావిషయంబగు. మరియు నీశ్వర నిర్మిత వస్తు రూప మొక్క ప్రకారంబుగా నుండియు జీవునిచే కల్పితంబైన భోగ్యత్వాకారంబునందు నానా ప్రకారమై యొప్పునది యభివ్యక్తంబు జేయుటకింకొక్క దృష్టాంతంబెట్లనిన, పితృజన్యమగు నొకానొక స్త్రీయొక్క మాంసమయంబైన రూపంబొక్క విధంబుగా నుండియు ఆ స్త్రీయు భోక్తృవుల బుద్ధి కల్పితా కారంబులచేత తండ్రికి కూతురన పతికి సతియన, సుతునకు తల్లియన, మామకు కోడలనినట్లు బహువిధత్వ మగుచుండు సర్వ విషయంబులు



యీశ్వర నిర్మితంబున నేకాకారమగు. జీవనిర్మితంబున అనేకాకారంబులచే నిట్లగు. వాటియందు యీశ్వర నిర్మిత ప్రపంచంబు బాధకంబుగాదు గావున, గురుశాస్త్రాది రూపంబులచే మోక్షసాధనం బయ్యు తనచే విడువ నశక్యంబై యుండునది.

## 51. ప్రపంచద్వయం

జీవకల్పిత ప్రపంచంబె బంధకరంబౌటచే ముముక్షువులచేత విడువదగినదై శాస్త్రీయ్య ప్రపంచంబని అశాస్త్రీయ్య ప్రపంచంబని ద్వివిధంబైయుండు. అయ్యశాస్త్రీయ్య ప్రపంచంబె బంధకంబు. గావున తీవ్రంబని, మందంబని రెండు తెరంగులగు.

అందు ఆత్మ బ్రహ్మవిచారంబె శాస్త్రీయ్య ప్రపంచంబనబడు. కామ క్రోధాదులే తీవ్ర ప్రపంచంబనదగు. మనఃకల్పిత రాజస తామసాదులె మంద ప్రపంచంబనదగు. ఇట్లు జీవకల్పిత త్రివిధ ప్రపంచంబునందు శాస్త్రీయ్య ప్రపంచంబె విచారజ్ఞాన సాధనంబుచేత ఆత్మ సాక్షాత్కారంబైన యనంతరంబున విడువందగు అశాస్త్రీయ్య రూపంబులైన తీవ్ర మందంబులను వుభయ ప్రపంచంబులను ఆత్మ సాక్షాత్కారంబునకు విరోధంబులు గావున, జ్ఞానాభ్యాసంబునకు పూర్వంబె విడువందగు. మరియు నయ్యుభయంబును బ్రహ్మ సాక్షాత్కారంబైనంతట మోక్షసిద్ధ్యర్థంబుగా సర్వదా విడువతగుననుటె రహస్యార్థంబగు.

## 52. ఉపాధిత్రయం

అవిచ్ఛిన్నోపాధి, ప్రతిబింబోపాధి, అధ్యాసోపాధులనునివె ఉపాధిత్రయంబగు. వాటియందు ప్రత్యగాత్మునకు సుషుప్తి రూపావిద్యయె అవిఛిన్నో పాధియనదగు. తత్కార్యమైన బుద్ధి యందు ఆత్మ ప్రతిఫలించుటె

ప్రతిబింబోపాధియనదగు. బుద్ది గత సుఖదుఖాదుల ఆత్ముండనుభవించి నట్లుండుటె అధ్యాసోపాధియనదగు. మరియు నది కానిదాని యందదియను బుద్ధియె శుక్తికా రజిత దృష్టాంతంబుచేత అధ్యాస లక్షణంబగు. ఆ యధ్యాసంబె మిథ్యాసంబని, యితరాధ్యాసంబని, యితరేతరాధ్యాసంబని, సత్యాధ్యాసంబని చతుర్విధంబై యుండు. వాటియందు అగ్ని సంపర్కంబుచేత జలంబున కుష్ణంబు గల్గినట్లు ప్రత్యగాత్ముని సన్నిధిచె క్రమంబుగా సంచరించుట, చూచుట, తలంచుట, తెలియుటలను శక్తి గలుగుటచె నస్థూలశరీరంబె మిథ్యాధ్యానంబనదగు. ఇంద్రియ వగంబె యితరాధ్యాసంబననగు. అంతఃకరణంబె యితరేతరాధ్యాసంబనబడు. మూలాహంకారంబె సత్యాధ్యాసం బనబడు. మరియును, అహం యనుటచేత ప్రత్యగాత్మాహంకారంబులకు రజ్జు సర్పంబన్నట్లు నిరుపాధి కాధ్యాసంబనిపించును. అహంకర్త యనుటచేత అహంకార ధర్మాత్ములకు రక్తస్ఫటికంబన్నట్లు సోపాధికాధ్యాసమనదగు. ఇచ్ఛామ్యహం అనుటచేత అహంకార ధర్మాత్ములకు ప్రవాహజల పతిత పతంగ ప్రతిబింబంబువలనె తద్ధర్మ తాధ్యాసమనదగు, కుటుంబవానహం యనుటచేత ఆత్మపుత్రాదులకు నౌకాస్తిత వ్యవహారంబువలెనే సంబంధ మాత్రా ధ్యాసమనబడు. ఇట్లధ్యాసంబులచేతనే నిర్వికారుండగు నాత్మునకు సంసార కల్పనయగు.

## 53. పంచావస్థలు

జాగరణ, స్వప్న, సుషుప్తి, తురీయ్య, తురీయ్యాతీతంబులనెడివె పంచావస్థలు. వాటియందు స్థూల పంచభూత, దశేంద్రియ, ప్రాణపంచక, అంతఃకరణ చతుష్టయంబులను చతుర్వింశతి తత్వాత్మక స్థూల శరీరంబునందు, సత్వగుణంబు అకారాక్షరంబు, విష్ణువధి దేవత, లోచనస్తానంబు. హృదయ కమలాష్టదళ గతుల చేతను విశ్వజీవుండు



విరాట్సంజ్ఞికుండగు నీశ్వరుండును నొక్కటియైగూడి వనితాది విషయభోగంబులను సకల కరణ సామగ్రిచేత ననుభవించు చుండుటే జాగ్రదావస్థయనదగు. మరి యా చతుర్వింశతి తత్వంబులందు స్థూలభూతంబులైదును, చిత్తబుద్ధులనునివి రెండును దక్క, తక్కిన సప్తదశ తత్వరూప సూక్ష్మతనువు నందు రజోగుణంబు ఉకారాక్షరంబు. బ్రహ్మాధి దేవత, కంఠస్తానంబు, హృత్కమలకర్ణికా గతులచేత తైజస జీవుండును సూత్రాత్మక సౌంజ్ఞికుండగు నీశ్వరుండును నొక్కటై జాగ్రద్వాసనా విషయ భోగంబుల మనంబున కరణంబుచేత ననుభవించుచుండుటె స్వాప్నావస్థ యనదగు. మరియు మేయుచున్న పిల్లల రెక్కల జేర్చుకొని నిద్రించు కుక్కుటంబు చందంబున, సమస్త కార్యంబులు లోగొని తత్సంసార సహితంబుగా ఆత్మాశ్రయంబునందు నిరవస్థచే నుండెడి ప్రకృతిరూప కారణ దేహంబునందు తమోగుణంబు మకారాక్షరంబు, రుద్రుండధిదేవత. హృదయ స్థానంబు, తత్కమలకర్ణికా మధ్య గతులచే ప్రాజ్ఞ జీవుండును, అంతర్యామి సంజ్ఞీకుండగు నీశ్వరుని తోడంగూడి బ్రహ్మానంద విషయ భోగంబును మాయావృత్తి యను సూక్ష్మకరణంబుచేత ననుభవుంచు చుండుటె సుషుప్త్యవస్థనదగు. మరియు నీ జాగ్రదాద్యవస్థలకు అవస్థాత్రయ, ధామత్రయ, స్థానత్రయ, పురత్రయ అవస్థలను నివి పర్యాయ నామంబులు. మరియు నా జాగ్రదవస్థయందె తత్కమలంబు విడిచి, మనో వ్యాపారంబుమాని, పరమాత్ముని చింతనంబు జేయుటె తురీయ్యావస్థ యనదగు. మరియు ఆత్మయందె మనసు మగ్నమై యుండుటె తురియ్యాతీతావస్థ యనబడు. మరియు నీ అవస్థలందు స్థావరంబులకు సుప్తి, పశ్వాదులకు స్వప్న సుషుప్తులు, దేవతలకు జాగ్రత్తు, మనుష్యులకు అవస్తాత్రయంబు, ఉన్మత్తులకు తురియ్యంబు, యోగులకు తురియ్యాతీతంబు

గలవు. వీటియందు మొదటి మూడవస్థలె మనుష్యులకు తమకుతామె గలిగియుండి సంసారాత్మకంబై యుండు. తక్కిన రెండవస్థలె యోగాభ్యాస బలంబుచే జనియించి ముక్తి సాధనంబులయి యుండు. మరియు అవస్థలయందు అవస్థాంతరంబు లేదు గావున కాల దేశాదుల నియమంబు లేదు గావున మిథ్యాభూతంబులగు వాటియం దనుస్యూతుండై యడలే కెరుంగుచుండెడి నిజతుర్యుండగు ఆత్మ సత్యంబగు. మరియు నాజాగ్రత్స్వప్నంబుల యందు యెరుక గల్గుటె ప్రసిద్ధంబు. ఆ సుషుప్తి యందెరుక లేదనుటకు మేల్కొన్నప్పుడు నేనేమియెరుంగక యుంటినని సుఖంబుగా నిద్రబోయితిననెడి స్మరణ ద్వయం బనుభవంబులేకనే పుట్టదనెడి అర్థాపత్తి ప్రమాణంబుచేత సుషుప్తి యందు ఆత్ముండు సమస్త ఘటాది రూపంబులలో గొనిన అంధకారంబును చక్షువులు చూచునట్లు సకల శరీరాది కార్యంబులలో గొనిన యవిద్యను అవిద్యా సూక్ష్మవృత్తుల యందు చంచలతరువల్లవాంతర చంద్రికా లేశంబులట్ల ప్రకాశించి లయంబు నొందుచుండెడి నిజ స్వరూపమైన ఆనందాంశంబులను కరణాంతరాపేక్ష లేక ననుభవింపుచుండు. గావున నచట యెరుక గలదనుటె సిద్ధంబు. మరియు నేమియెరుంగక సుఖంబుగా నిద్ర బోతిననుటకు క్రమంబుగా సకల విషయ జ్ఞానంబులేక సంసార దుఃఖనివృత్తి గలుగక సర్వదా సుప్తియందు అవిద్యకు సాక్షికుండై ఆనందమయుండైన ఆత్ముండు గలిగియుండ నొక్కటె నాయందు యెరిగితిననెడి దేమికారణంబున లేదనిన సొమ్ములరయ కూపోదకంబున మునంగిన పురుషుండు కలదు లేదనుట కచట నుండి వెడలినగాక తెలుపుటెట్ల ఘటించదో అట్లు సుషుప్తియందెరుక గల్గినను కాల కర్మవంశంబుచే మేలుకొని కరణ సహకారియైన గాక నచట యెరిగిన యర్థంబు దెలుపుట ఘటింప దట్లగుట వల్ల సర్వావస్థలకు



సాక్షికుండగు ఆత్మునకు సచ్చిదానంద స్వయంప్రకాశ రూపత్వానుభవంబు సిద్ధంబగు.

## 54. కోశపంచకం

అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయంబులనెడివె పంచకోశంబులు. వాటి యందు పితృ మాతృశుక్ల శోణితంబులచే నైన స్థూల శరీరం బన్నమయంకోశంబగు. సూక్ష్మతను వందలి ప్రాణవాయు కర్మేంద్రియ పంచకంబునుంగూడి ప్రాణమయ కోశంబగు. మనస్సున్ను జ్ఞానేంద్రియ పంచకంబునుంగూడి మనోమమకోశంబగు. ప్రత్యగాత్మ చైతన్యఛాయ తోడంగూడి లోహాంతకుంతంబునుం వలె నుండెడి యహంకారంబు జ్ఞానేంద్రియంబులు గూడి విజ్ఞానమయకోశమగు. కారణ దేహరూపంబైన అవిద్యయు జాగ్రదవస్థయందు వనితాది విషయ దర్శన సామీప్య, సంయోగంబులచే క్రమంబుగా బుట్టెడి ప్రియం, మోద, ప్రమోదంబులనెడి త్రివిధంబులంగూడి ఆనందమయకోశమగు. మరియు విజ్ఞానమయ కోశ రూపంబైన అహంకారమునే ఆత్మానాత్మ వివేక శూన్యులగువారు అహంబనెడి తమ యనుభవంబుచేత ఆత్మయని తెలియుదురు. అందుకు నీలోత్పలంబున నీలగుణ విశేషంబుతోడ విశేష్యమైన ఉత్పలంబు వేద్యంబైనట్లు, కృశోహంబనునెడ స్థూల తనువు తోడను, శ్రోత్రియోహంబనునెడ యింద్రియంబులతోడను, ధ్యాతాహంబనునెడ అంతఃకరణంబుతోడను, ప్రత్యగాత్మునకు వేద్యంబౌటచేతను అహంకారంబు యాత్మయనుట తగదు. మరియు నటులైన అచేతనంబైన యహంకారంబునకు బాహ్యాభ్యంతర విషయంబు లెరుంగుటెట్లనిన అయస్కాంత సాన్నిధ్యంబున అయస్సు చలించినట్లు అతపంబున దర్పణంబు బట్టిన గృహాంతర్గతాంధకారంబు

పరిహారంబగు చందంబున, ప్రత్యగాత్మ సన్నిధివల్ల తత్‌చైతన్య ప్రతిబింబంబు తనయందు యుండుటచేతనున్నూ జడమైన యహంకారంబు బాహ్యవిషయంబుల నెరుంగుచు జాగ్రత్స్వప్నంబుల యందు సంచరించి, సుషుప్తి యందణంగుచుండు. తత్ప్రపంచంబునకు ఉపమానం బెట్టిదనిన యహంకార లయావస్థాత్మక సుషుప్తియందా యవిద్యయనెడి మూల యింటి యొక్క భిత్తిని నిద్రయను కవాటమునున్నూ నిష్కంపదీప రూపుడై తన్నుతానె ప్రకాశింపుచుండెడిదే ప్రత్యగాత్మ జ్యోతియనదగు. పిదప కాలకర్మాది సమీరణ ప్రేరణచేతనే తామసంబైన నిద్రయను కవాటంబు తెరువగ, మరి యా దివ్య ప్రథమావస్థాత్మక మహతత్త్వమను గేహాళిపైనుండెడి సాత్వికమైన యహంకాంరబను స్ఫటిక మణియందలి ప్రత్యగాత్మ ప్రదీప ప్రతిబింబ గర్భితంబై మునుపటియట్ల జీవింతుననిపించి స్వప్నావస్థయను నట్టింట వెలుంగజేసి, మీద యింద్రియంబులను గవాక్షంబుల వెడలి జాగ్రదవస్థయను బాహ్యగణంబును ప్రకాశింపజేయుచుండును. మరియు కాలకర్మాది సమీరణ ప్రేరణచేతనే నిద్రయను కవాటంబు మూయునపుడు యహంకార మనెడి స్ఫటిక మణియు తనకు కారణమయిన యవిద్యయందడగునపుడు జాగ్రత్స్వప్నంబనెడి లోగిలి నట్టిల్లును, అంధకారమయంబులగు నా యహంకార మణియందు ప్రతిబింబించిన చిద్దీప ప్రకాశంబే తనకు మూలభూతమైన ప్రత్యగాత్మ ప్రదీప మందేకమగుచుండు.

ఇట్లు జాగ్రదాద్యవస్థాత్రయంబున యహంకార భావాభావంబుల నవికారుండైయరిగెడి ఆత్మ యొక్కడు అన్యుండై యుండుగావున యహంకారం బాత్మగాదనుటె సిద్ధంబు, మరియు బాహ్య విషయంబున కాత్మయై ప్రత్యగాత్మునకు వేద్యంబౌటచే జడాజడ స్వరూపంబైన దర్పణపూర్వ



పశ్చద్భాగంబులట్ల ప్రకాశాప్రకాశాత్మకమైన యహంకారంబునకు దేహచిచ్ఛాయా ప్రత్యగాత్ములను మూటితోడ సంబంధంబు గలదు.

## 55. తాదాత్మ్యత్రయం

వాటియందు అహంజ్వరామియనుటచే చిత్ప్రతిబింబంబ యుక్తమైన యహంకార సంబంధంబుచే స్థూల దేహంబున కుష్ణాదుల తెలియుటె కర్మ జనితంబైన కర్మజ తాదాత్మ్యమగును. మరియు అహం జానామి యనుటచే చిచ్ఛాయాహంకారంబుల సంబంధమైన సృష్టి తొడగి మోక్షావధిగా జెడకుండు గావున సహజ తాదాత్మ్యంబనదగు. మరి యహం కర్తా యనుటచే అసంగుడైన ప్రత్యగాత్మాహంకారంబుల సంబంధమె భ్రాంతిజన్య తాదాత్మ్యమనదగు. ఇవి మొదలయిన వెల్ల దృశ్య వివేకమనఁనొప్పు.

## 56. జీవ సస్తావస్థలు

అజ్ఞానంబు, ఆవరణంబు, విక్షేపంబు, పరోక్షజ్ఞానంబు, అపరోక్ష జ్ఞానంబు, శోకనివృత్తి, నిరంకుశతృప్తి యను నివె జీవుని సప్తావస్థలు. వాటియందు సంసారాసక్తుండైన చిదాభాసజీవుండు శృతి విచారంబునకు పూర్వంబె తన నిజస్వరూపంబైన స్వయం ప్రకాశుండగు ప్రత్యగాత్ముని నెరుంగకుండుటె అజ్ఞానంబనబడు. పిదప నొకానొక కాలంబున చిదాత్మ ప్రసంగంబు గలుగగా ప్రత్యగాత్మ లేడు. అతడు వుంటె ప్రత్యగాత్మ తోచడా? యను ఉభయ విధంబైన సందేహంబె అజ్ఞాన కార్యంబైన ఆవరణమనదగు. పిదప తానె కర్మ కర్తృవని తానే కర్మఫల భోక్తృవని తెలియుటె దేహాభిమానియైన చిదాభాస జీవునికి విక్షేపంబనబడు. మీద యాత్ముని యస్తిత్వంబు చెప్పెడి వృత్యాచార్య వాక్య విశ్వాసంబుచేత ప్రత్యగాత్మ గలండని తెలియుటె మొదటి యసత్వావరణ నివర్తకమైన పరోక్ష జ్ఞానమనదగు. మరియు నీవే

పరబ్రహ్మంబ వని జెప్పెడి వేద వాక్య పరిపాక వశంబుచేత ప్రత్యగాత్మ తానని దెలియుటె ద్వితీయ్యంబైన యభాసావరణ నివర్తకంబైన అపరోక్ష జ్ఞానమనదగు. ప్రత్యగాత్మ సాక్షాత్కారంబుచేత పిదప నేను కర్మ కర్తృ కర్మఫల భోక్తృవనెడి జీవరూప దుఃఖపరిత్యాగంబె శోకనివృత్తియనదగు. మరియు నింక చాయందగిన కృత్యంబులన్నియు చాయంబడియె, పొందదగిన ఫలజాతంబులంన్నియు పొందబడియెనని సహజ పరితుష్టి గలిగియుండుటె నిరంకుశ తృప్తి యనబడును. శోకనివృత్తి, నిరంకుశ తృప్తి యను నీ యవస్థాద్వయంబె అపరోక్ష జ్ఞానఫలమనదగు. మరియు స్వయం ప్రకాశ చిద్రూపుండైన యాత్మునకు నిత్యాపరోక్షంబు గల్గియుండుట చేత యాతని యందీ యజ్ఞానాది సప్తావస్థలు ఘటింపనేర వన్నందుకు దృష్టాంతంబెట్లన్నను పూర్వంబున దశపురుషులు ఒకనది దాటి, చని, యందు తమ్మునందరింజూడ నిశ్చయించి జూచునప్పుడు వారియందు నవసంఖ్యా పురుషులం ముందు నిల్పి గణించిన పురుషుండుతానె దశమపురుషుడని తెలియనేరనిదే అజ్ఞానమనదగు. మరియు దశమ పురుషుండు లేడు అతను వుంటె గానరాకుండునా యను ఉభయవిధ భ్రాంతి ఆ యజ్ఞాన కార్యమైన ఆవరణంబనదగు. మరియు దశమ పురుషుండు నదియందు మృతుండయ్యె ననెడి దుఖంబె విక్షేపంబనదగు. పిదప అన్యుండగు ఆప్తుని వచనంబుచే దశమ పురుషుని స్వగంబున నున్నయట్లు గలడని తెలియుటె దశముండు లేడనియెడి ప్రథమావరణంబునకు విరోధియైన పరోక్ష జ్ఞానమనబడు. పిదప నవ సంఖ్యా పురుషుల తోడగూడి క్రమంబుగా గణింప నీవే దశమపురుషుండవని బలికిన తనకు తానె సాక్షాత్కరించుటె దశమ పురుషుండు గానరాడనెడి ద్వితీయ్యావరణంబునకు విరోధియైన యపరోక్ష జ్ఞానమనదగు. దశమ పురుషుని మృతీదుఖంబు విడుచుటె శోకనివృత్తియనబడు. మరి నిజస్థితిచే సుఖంబుగా నుండుటె నిరంకుశ తృప్తియని తెలియందగు.

## 57. వేదవాక్యత్రయం

వేద వాక్య విచారంబెట్లనిన విధి వాక్య, నిషేద వాక్య, సిద్ధాబోధక వాక్యంబులని వేద వాక్యంబులు త్రివిధంబైయుండు. యజ్ఞాదులు చేయవలయు ననుటయె విధి వాక్యంబులు. సురాపానాదులను జేయరాదనుటయె నిషేధ వాక్యంబు. విధి శూన్యంబుగా బ్రహ్మాత్మైక్య రూపవస్తు మాత్రంబు బోధించునదె సిద్ధాబోధక వాక్యంబులు.

## 58. మహావాక్యములు

ఋగ్యజుస్సామాథర్వణంబులను నాల్గు వేదంబులు. వాటియందు క్రమంబుగా ప్రతిపాదింపబడిన ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్వమసి, అయమాత్మ బ్రహ్మ యనునివె సిద్ధాబోధక వాక్యంబులు. వాటియందు ముఖ్యమైన తత్వమసి యను మహావాక్యమునకు తత్ త్వం అసి యనెడిదే పదత్రయంబు. వాటికి శివ, జీవ తదుభయైక్యంబనెడిదే క్రమంబుగా అర్థత్రయంబగు. మరియు పద పదార్థ వాక్యార్థంబులకు సామానాధికరణ్య సంబంధ, విశేషణవిశేష్య సంబంధ, లక్ష్యలక్షణ సంబంధంబులనునివె క్రమంబుగా సంబంధ త్రయంబగు. మరియు పదార్థంబులకు వాచ్యార్థ, లక్ష్యార్థంబులను అర్థద్వయంబుండు. వాటియందు పూర్వోక్త స్థూలాది తనుత్రయ సమష్టి రూపంబైన విరాట్హిరణ్యగర్భ యీశ్వరులును బ్రహ్మయుంగూడి తప్తాయఃపిండంబువలె నేకాకారంబుగా జూచుటె తత్పదంబునకు వాచ్యార్థంబని, ముఖ్యార్థంబని, అభిధానార్థంబని జెప్పంబడు.

మరియు తనుత్రయ వ్యష్టిరూపంబైన విశ్వ తైజస ప్రాజ్ఞులను వారలును ప్రత్యగాత్మయుగూడి తప్తాయః పిండంబువలె నొక్కటిగా తెలియుటె త్వంపదంబునకు వాచ్యార్థంబని, ముఖ్యార్థంబని, అభిధానార్థంబని యొప్పు. మరియు విరాట్పురుషాదుల పృధక్కరించిన నిరుపాధిక బ్రహ్మంబె తత్పద లక్ష్యార్థంబని, శోధిత తత్పదార్థంబని చెప్పంబడు. పిదప విశ్వాది జీవత్రయంబులను పృధక్కరించిన నిరుపాధిక ప్రత్యగాత్మే త్వంపద లక్షార్థంబని, శోధిత త్వంపదార్థంబని జెప్పంబడు. మరియు లక్షణాలు జహల్లక్షణ అజహల్లక్షణ జహదజహల్లక్షణలన త్రివిధంబైయుండు. వాటికి గంగాయాంఘోషః, ప్రతి వసతి కుంతాః ప్రవిశంతి, సోయం దేవదత్తః యనునివె క్రమంబుగా నుదాహరణంబులగు. వీటియందు గంగాశబ్దంబు తనకు ప్రవాహరూపంబైన ముఖ్యార్థంబను ఘోషను గొల్లపల్లెకా శ్రయత్వంబు ఘటించదు గావున గంగను విడిచి తీరంబును లక్షింపుచుండు. మరియు కుంతశబ్దంబు తన ముఖ్యార్థంబును విడువకనే కుంతధారులైన పురుషులను లక్షించుచుండు. సః అనుశబ్దంబు భూతకాల దేశ వయోవిశిష్టుండైన దేవదత్తునిం జెప్పుచుండు. అయంయనుశబ్దంబు వర్తమానకాల దేశవయోవిష్టుండుగు దేవదత్తునిం జెప్పుచుండు. ఇట్లు ఉభయవిరుద్ధ పదార్థంబులకు నైక్యత్వంబు ఘటించకున్న నా వుభయ తదార్థగత విరుద్ధధర్మాంశంబుల విడిచి అవిరుద్ధ ధర్మాంశమైన దేవదత్త మాత్రంబునే స్వీకరించి, మరి అతడితడె! ఇతడతండని యిట్లు తాదాత్మ్యంబు ఘటింపజాయగా జహదజహల్లక్షణయని అర్థలక్షణయని భాగత్యాగ లక్షణయని పర్యాయ నామంబులు గల్గియుండు. తత్త్వమసి యను వాక్యంబునందు ఉదాహరణంబుగా నిదొక్కటె జెప్ప యోగ్యంబదెట్లనిన తత్ యను పదంబె వాచ్యార్థంబైన సర్వజ్ఞత్వాది సద్గుణ విశిష్టుండగు పరోక్ష బ్రహ్మంబును జెప్పుచుండు. త్వం యనుపదంబె వాచ్యార్థమైన కించిజ్ఞాత్వాది హీనగుణ విశిష్టాపరోక్ష జీవునింజెప్పుచుండు. ఇట్లుభయవిరుద్ధ ధర్మంబుగల పదార్థంబుల కేకత్వంబు లభించదుగావున ఉభయ పదార్థగత పరోక్షత్వా పరోక్షత్వాది విరుద్ధ ధర్మాంశంబుల విడిచి అవిరుద్ధ చైతన్య మాత్రంబైన లక్ష్యార్థంబనెడి బ్రహ్మ కూటస్థుల స్వీకరించి అదెయిది యిదెయది యనియిట్లు తాదాత్మ్యంబు ఘటింపుచుండు. అసి యను పదంబా వుభయ లక్ష్యార్థంబుల యందలి పరోక్షత్వాపరోక్షాత్వాదుల నవిద్యాకల్పితంబులని బోధింపుచు సఫలంబగు. అప్పుడాత్మునకు అఖండైక రస బోధమాత్రంబె సిద్ధంబనుట వాక్యార్థంబగు.

## 59. శృతియుక్త వాక్యం

తత్త్వమసి యను మహావాక్యంబునందు ప్రత్యగాత్మ పరమాత్ముల కేకత్వంబనుట ఘటాద్యుపాధుల నేతి నేతి ముఖంబున నిషేధించి ఆకాశంబొక్కటె యనినట్లు. శ్రీరామచంద్రుని మనుజత్వంబు విడిపి నీవె విష్ణుడవనిన రీతి. కర్ణుని వ్యాధభావంబు మాన్పి నీవె కుంతిపుత్రుండవనినజాడ, దశమ పురుషుని మరణ దుఃఖంబుమాని తానె దశమ పురుషుండని తెలిసినభంగి స్వభావసిద్ధంబగుగాక. మరియు నొకపుష్పంబుచె స్వర్గంబని నదే మోక్షంబు నందపేక్ష బుట్టించెడిది అర్థార్థంబనియు ప్రతిమల దేవతాకృతులనెడి వాక్యంబుజూడ ఉపాస నాపరంబనియు మనుజుని దేవేంద్రుడనిన మాట్కి, స్తుతి పరంబనియు బంటేలికెయనిన విధంబున ఉపచారంబనియు అగ్ని మాణవ కుండనిన వాక్యంబులాగున గుణసాదృశ్య పరంబనియు యిదె గోదేహంబను వాక్యంబు చందంబున జాతి వ్యక్తి పరమని ఘటమృత్తుల మేదను కార్యకారణ పరంబనియు, నీలోత్పలంబులను వాక్యంబు నన్యంబులనెడి వాక్యంబు కైవడి గుణ గుణి త్వంపరంబనియు క్షీరదధుల కభేదంబను వాక్యంబు సొబగున

వికారపరంబనియు, వారికణంబుల కేకమను వాక్యంబు చెలువున అంశాంశకంబనియు బింబ ప్రతి బింబంబుల కైక్యంబనిన వాక్యంబు పెల్లున బింబప్రతిబింబ వాదంబనియు నివ్విదంబుగా భేదపరంబై వికల్పించి జెప్పిన శృతివిరోధంబగు.

## 60. ముక్తి సంశయ నిరసనం

సకల ప్రపంచంబునకు మిథ్యాత్వంబు జెప్పెడి వేదాంత పక్షంబునందు శృతి విచారంబుచేత నెట్లు సత్యమైన ముక్తి ఘటించుననిన భ్రాంతియైన స్వప్న వనితా సంభోగాదులచె సత్యంబైన వీర్యపతనాదులు, కల్పిత శిలా భైరవాది దేవతా భజనంబులచే తథ్యంబైన సత్యంబైన ముఖలావణ్యాదులు దృష్టంబైనట్లు, అసదాత్మకశృతి విచారంబుచేత పరమార్థంబైన ముక్తి సిద్ధియగు.

## 61. ముక్తి విఘ్నత్రయం

అజ్ఞాన, సంశయ, విపరీతంబులనెడిదె ముక్తికి విఘ్నత్రంయబు. వాటియందు నేబ్రహ్మగాననుటె అజ్ఞానమనదగు. నేబ్రహ్మయగుదునో కానోయనెడిదె సంశయమనదగు. శృతియుక్తులచె నేబ్రహ్మయైనను మునపటి జీవభావమె నాకున్నదనుటె విపరీతంబనదగు.

## 62. అజ్ఞానాదుల విఘ్నత్రయం

శ్రవణమనన నిధిధ్యాసనంబులను నివె క్రమంబుగా అజ్ఞానాదులకు విరోధిత్రయంబు. వాటియందు శృతి విచారంబుచేత సూతకాదుల యందు ధృఢబుద్ధి నుండుటెట్లట్లు ప్రత్యగాత్మ బ్రహ్మలకైక్యంబను ఉపనిషద్వాక్య తాత్పర్యం బవధరించుటె శ్రవణమనదగు. ఆ శృత్యర్థంబులను యుక్తిచే చింతనంబు చేయుట మనన మనదగు. ఆ శ్రవణ మననంబులచేత నిశ్చితంబైన యర్థంబునందు చిత్తంబు నిశ్చలంబై యుండినదే నిధిధ్యాసమనదగు. మరి యిచట శ్రవణంబుచేత నుత్పన్నంబైన జ్ఞానంబుచే ఆత్మ సాక్షాత్కారంబైయుండు గావున శ్రవణంబే ముఖ్యమై యుండుటచేత అంగియనదగు. మనన నిదిధ్యాసనంబులు దానికి సహకారులగుటవల్ల ముఖ్యంబులుగావు కావున అంగంబులనదగు. అదెట్లనిన అర్థప్రకాశమగు దీపము యొక్క చంచలావస్థయందు కార్యసామర్థ్యంబు లేదు గావున, వాయు సంచారంబునకు మరుగుజేయు తెరయనుంబోలె మననంబు. దాని వత్తి నెగయందోసి ప్రజ్వలనంబు చేసినయట్లు నిధిధ్యాసంబు.

## 63. షడ్విధలింగ తాత్పర్యం

ఉపక్రమోపసంహార, అభ్యాస, అపూర్వత, ఫల, అర్థవాద, ఉపపత్తులను నివి శ్రవణంబునకు షడ్విధలింగ తాత్పర్యంబులు, వాటియందు సృష్టికి పూర్వంబున యీ ప్రపంచంబు సద్రూప బ్రహ్మంబైయుండెనని బ్రహ్మంబునకు స్వగతాది భేదత్రయంబు నివారింపుచు అఖండైక రసంబుగా జెప్పుటె ఉపక్రమమనదగు. మరియును నామరూపాత్మక ప్రపంచంబున కా బ్రహ్మమందు లయంబుజేసి ప్రత్యగాత్మున కా బ్రహ్మంబుతో నేకత్వంబు బోధించుచు బ్రహ్మ అద్వితీయ్యంబని జెప్పుట ఉపసంహార మనదగు. నీ యుపక్రమోపసంహారంబులనెడి రెండు గూడి యొక్క లింగంబైయుండును. ప్రత్యగాత్మున కా ప్రత్యక్షాది ప్రమాణాతీతత్వంబుచెప్పుటె అపూర్వత యనబడు. మరియు నాత్మ యొక్కటని దెలియుట చాత సర్వంబునుం దెలియంబడెనని జెప్పుటె ఫలంబు. ప్రత్యగాత్మ రూప నిర్వికార బ్రహ్మంబునకు స్థితస్యగతి శ్చింత్తనియ్యాయనెడి న్యాయంబుగలదు గాన జగత్సృష్ట్యాద్యను ప్రవేశాంతమైన పంచకృత్య కర్తృత్వంబు జెప్పుటె భూతార్థవాదమనదగు. ఘటంబునకు

మృత్తు, తంతువునకు పూననాభియే నిమిత్తంబన్నట్లు బ్రహ్మంబె జగత్కారణంబని జెప్పుటె దృష్టాంతంబగు.

## 64. మనన సహాయత్రయం

యుక్తి, తర్క, అనుమానంబులను నివి మనన సహాయంబులు. వాటియందు ఆత్ములనేకులని నిర్వ్యాపకులను సాంఖ్యాది మతంబులందా సమస్తాత్ములకును ప్రత్యేక శరీరంబుల సంబంధంబులు గలిగి యుండుటచే యితనికే యీ శరీరంబు భోగ సాధనంబు, అన్యులకు గాదని, భోగస్థితిని జెప్పుటె ఘటింపదు. మరియు నొకానొక యీతని సుకృతాదికంబుచేత సంపాదింపంబడినదిగాన యీశరీరం బితనికె అన్యులకుగాదనిన ఆ సుకృతాదికంబు సర్వులకు లేదాయని మరి యితని పూర్వ దేహాభిమానంబుచేతను చాయబడిన సుకృతాదికంబితనిదె యనిన ఆ యాభిమానంబును పూర్వదేహంబునందుండిన యనేకాత్ములకు లేదా యేమి, మరి యిట్లు సర్వ సాంకర్యంబగు అనవస్థా దూషణంబు నివారింప నశక్యంబది యెట్లనిన, సర్వాత్ములు అనాదులౌటచేత మరియు నేకాత్మపక్షమందు భోగావస్థ ఘటించదని నానాత్మ పక్షంబు నాశ్రయించి యిట్లు భోగస్థితి ఘటింపనేరదయ్యె. మరియు నుభయ మతంబులందును యీ శంక సమానంబనిన యేకాత్మ పక్షమందు బింబప్రతి న్యాయంబు చేత ఉపాధులైన యంతఃకరణ కంపా కాలుష్యాది సులభంబనుటె యుక్తి యనదగు. ఇట్టి యుక్తి తర్కానుమాన లక్షణంబులు హర్ష మిశ్రాచార్యాదుల ఖండనాదుల యందు ప్రసిద్ధంబుగానుండు. నిదిసుఖానుభవ ప్రకరణంబౌటచేత గ్రంథ బహుళ్యంబగు ననుభీతిచే ప్రతి పాదింపంబడదయ్యె.

## 65. నిధిధ్యానయోగ పంచకం

మంత్రయోగంబు, స్పర్శ యోగంబు, భావయోగంబు, అభావయోగంబు, మహాయోగంబను నివె నిధిధ్యాసరూప యోగపంచకంబు.



వాటియందు ప్రణవాది మంత్రానుసంధానంబు చేత పరమాత్మయందు మనోలయంబవుటె మంత్రయోగంబనదగు. ఆ మంత్ర యోగంబు తోడంగూడి మనఃపవనంబులొక్కటిజేసి మూలాధారంబున సుషుమ్నానాడీ మార్గంబునొంది శిరోమధ్యగత పరమాత్మ తేజంబునందు మనోలయంబైన దె స్పర్శ యోగంబనదగు. మొదట స్వర్గమె మూర్ధంబు, దిక్కులె శ్రోతంబులు, చంద్రార్కులే నేత్రంబులు, అగ్నియె ముఖంబు, అంతరిక్షంబె నాభియు, భూమియె పాదంబులగునని యీశ్వరుని విరాడ్రూపంబు దలంచుట, అట్లుగాకున్న నపరిమిత భుజావస్త్రాభరణాదులు గల యీశ్వరుని దివ్యమూర్తిని పరిభావించి మరి యిట్టి యవయవంబుల నొక్కొక్కటి విడిచి తక్కిన అవయవ మాత్రంబగు సద్రూప బ్రహ్మంబు నందు మనోలయంబవుటే భావయోగంబనదగు. మరియు కరణ గోచరంబుగాని ప్రమాణాతీతమైన నిరుపాధిక బ్రహ్మమందు మనోలయమవుటె అభావయోగమనదగు. జగదుదయ లయంబు లందును నేనెరుగక నెరిగితి నను నపుడును తనకేహానియు లేకనే, యేక ప్రకారమైన ప్రత్యగాత్మరూప బ్రహ్మంబునందు మనోలయంబగుటె మహాయోగంబనదగు.

## 66. ప్రతిబంధత్రయం

భూత ప్రతిబంధ, వర్తమాన ప్రతిబంధ, భావప్రతిబంధంబులను నివె యాత్మసాక్షాత్కారంబునకు విరోధిత్రయంబు. వాటియందు మోక్షాపేక్షచేత సర్వసంగ పరిత్యాగంబుచేసి శ్రీగురు నాశ్రయించి శ్రవణాదులంజేసినను మొదలు గృహస్థాశ్రమమందు స్వీకరించియున్న వనితాది వస్తురూప యవ్వన శృంగారాది గుణానుభవరుచియె సంస్కారబలంబుచేత డెందంబున నెలకొని మాటిమాటికి చిత్తచలనంబు పుట్టించి ఆత్మసాక్షాత్కారంబు గానీకయుండినదె భూత ప్రతిబంధమనదగు. మరియు జడబుద్ధియు, జడసంగరతీయు, విషయాసక్తియు, కుతర్కంబు

అభిమానంబు, చపలత్వాదులు గలిగి తత్త్వ విచారంబు చేసినను ఆత్మసాక్షాత్కారంబు గలుగనియ్యక యుండునదె వర్తమాన ప్రతిబంధ మనదగు. మరియు ముందరకొన్ని జన్మాంతరంబు వచ్చినగాని తీరని యా ప్రారబ్ధ విశేషంబనెడి బ్రహ్మాదిలోక వాంఛయను దోషద్వయ యుక్తంబైయుండి వేదార్థంబెరింగినాగానీ ఆత్మసాక్షాత్కారంబు గానియ్యకుండునదె భావి ప్రతిబంధమనదగు.

## 67. అవధిత్రయం

ప్రతిబంధత్రయంబు భేదించుటకై జ్ఞానవైరాగ్యోపరతు లను ముఖ్యసాధనంబుల విడువక నభ్యసింపదగు. వాని కారణము స్వరూప కార్యంబులనెడి మూడు మూడు లక్షణంబుల క్రమంబుగా విభజించి జెప్పంబడు. అదెట్లనిన జ్ఞానంబునకు శ్రవణాదులే కారణంబు. ఆత్మాహంకారాధ్యాసైక్యంబు విభజించుటె స్వరూపంబగు. ఆ యహంకార గత సంసార సాక్షిత్వంబె కార్యంబగును. వైరాగ్యంబునకు వనితాది విషయంబుల యనిత్యత్వాది దోషదర్శనంబె కారణంబగు. మరి యే ప్రకారంబైనను అట్టి కారణమును విడుచుటె స్వరూపంబగు. విషయంబులందు ప్రవేశింపనిదె కార్యమనదగు. ఉపరతికి యమ నియమాద్యష్టాంగ యోగంబులె కారణంబగు. చిత్త మంతరంగంబున నేకాగ్రమైనదె స్వరూపమనదగు. పిదప బాహ్య కర్మంబునందు ప్రవేశింపకుండుటె కార్యమనదగు. మరియు వాటియందు దేహాత్మభావంబు సహజంబై తోచినట్లు బ్రహ్మంబె తానను దృఢబుద్ధియె జ్ఞానంబునకవధి. బ్రహ్మలోకాది తృణీకారంబె వైరాగ్యంబునకవధి. సుప్తునియట్ల సకల కార్య విస్మరణంబె వుపరతికవధి. వీటియందు జ్ఞాన వైరాగ్యోపరతులను నీ త్రివిధంబును సిద్ధించిన యతనికి యది మహాతపః ఫలబనదగు. వైరాగ్యోపరతులను రెండే సంపూర్ణంబైయుండి జ్ఞానంబొక్కటి లేకున్న అతనికి ముక్తి ఘటింపదు. మహాసుఖస్థానంబైన ఊర్ధ్వలోక ప్రాప్తియగును. జ్ఞానంబుగలిగి వైరాగ్యోపరతులు లేకున్న నతనికి వృక్షాగ్రచ్యుత పాదుండగు పురుషునకు పతనేచ్ఛ లేకున్నను బడునట్లు దేహావసానంబున ముక్తియె యగుననుటె సిద్ధంబు. ప్రారబ్ధ జనిత దుఖానుభవంబు గలదనుటె ప్రసిద్ధంబు.

## 68. అజ్ఞానభూమికలు

అజ్ఞాన భూమికలెట్టివనిన బీజ జాగ్రత్తును, జాగ్రత్తును మహాజాగ్రత్తును, జాగ్రత్స్వప్నంబును, స్వప్నంబును, స్వప్నజాగ్రత్తును, సుప్తకంబనునవి నొండొంటి గలిసిన యనేక భేదంబులైయుండు. వీటిలో ప్రాథమిక చిత్తే నిర్మలంబై అనాఖ్యంబై యుండియు భవిష్యచ్చిత్త జీవాది శబ్దార్థంబులుగా బరిణమింపంగల దెద్ది యా పరిణామంబునకు ప్రథమ స్ఫురణంబై బీజరూపంబుగా నుండునదె బీజ జాగ్రత్తనదగు. పిదప ప్రజ్ఞాప్రకటంబై యిది తన గృహం బిది తన దేహం బిది రేబగలను ప్రాగభావంబైన ప్రత్యయంబులు గల్గినవే జాగ్రత్తనదగు. జన్మాంతర వాసనా వశంబుచే నితడతడను నాయదియను స్థూల ప్రత్యయంబులు పూర్వోక్త ప్రకారంబుగా స్ఫురించునదే మహాజాగ్రత్తనదగు. జాగ్రదవస్త యందు మనోరాజ్యమయంబై యుండినదే జాగ్రత్స్వప్నం బనదగు. మరియు ద్విచంద్ర శుక్తికా రజిత మరుమరీచికా జలాది అనేక విధ భ్రాంతి గల్గుట స్వప్నమనబడు. చూచిన పురుషుని బహుకాలంబునకుం మరియుంజూడ నెవడోయని కొంత దడవు చింతింపనంతట స్ఫురించునదే స్వప్న జాగ్రత్తనదగు. ఉక్త షడవస్థా విలక్షణంబై భవిష్య దుఃఖహేతుభూతంబైన జాడ్య భూయిష్టస్థితి గలిగి యుండుటె సుషుప్తక మనదగు. ఈ యవస్థల యందు సకల జంతువులు గలిగి యుండు తురియ్యజ్ఞాన సప్తావస్థ లొక్కొకటీ యనంత భేదంబులై యపరిమితంబులై యుండునని తెలియంబలికె.

## 69. జ్ఞాన భూమికలు

సుఖేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్త్వాపత్తి, సంసక్తి, పదార్థభావన, తుర్యగామిని యనునివి సప్తజ్ఞాన భూమికలు. వాటిలోనే మూఢుండనై యుండుటకు కారణంబేమియని శృతి గురువులచేత నెరుంగవలయుననుటె సుఖేచ్ఛయనదగు. పిదప గురుశాస్త్రాదులవల్ల జనించిన కించి ద్వైరాగ్యంబుచేత కలిగిన సదాచార ప్రవృత్తియె విచారణ యనదగు. మరి సుఖేచ్ఛ విచారణలను నీ రెంటి బలంబులచేత విషయాసక్తి చెడుటె తనుమానసీ యనదగు. మీద నా భూమిత్రయాభ్యాస సామర్థ్యంబుచేత జాగ్రత్ప్ర పంచబంతయు స్వప్నంబని నెరింగి ఆత్మని సన్మాత్రానుసంధానంబె సత్త్వాపత్తి యనదగు. మరి సకల ప్రపంచంబు దోచుటణగి సుప్తుని యట్లాత్మని చిన్మాత్రావశేషిత్వంబె అసంసక్తి యనదగు. మరియు సమస్త విషయ విలయంబుచేత గాఢ సుప్తునియట్లు ఆనందాత్మలీనత్వంబె పదార్థ భావన యనబడును. పిదప కలదు లేదవలేదనుటె లేక, అహంకృతి నిరహంకృతి దోచకనే కేవలజ్ఞప్తి మాత్రరూపమైన యద్వైతపదంబునందు ఆకాశ మధ్య కుంభాకృతి వెలిలో శూన్యంబై యుండుటె తుర్యగామిని యనదగు.

## 70. షట్సమాధి

ఉపరతీ యనుసారులగు దృశ్యానువిద్ధ శబ్దానువిద్ధ నిర్వికల్పంబులను నివి బాంహ్యాభ్యంతర భేదంబులచే షట్సమాధులనదగు. వాటియందు ఘటాదివిషయ జాతంబులం దేదైనను గురించి దాని యందు నామరూపంబులను రెండు మాయాంశంబుల విడచి అస్తి భాతి ప్రియంబులను సచ్చిదానంద బ్రహ్మాంశంబు ననుసంధానంబు జేయుటె బాహ్య



దృశ్యాను విద్ధంబను సవికల్ప సమాధియనదగు. అఖండ సచ్చిదానందా ద్వితీయ్య స్వరూపమైనదే బ్రహ్మంబని ధ్యానంబుజేయుటె బాహ్యశబ్దాను విద్ధంబను సవికల్ప సమాధియనదగు. ఉక్తసమాధి ద్వయాభ్యాస బలంబుచేత బ్రహ్మానందాస్వాదనంబు నందే మనస్సు మగ్నమై నిస్తరంగ సముద్ర మందు వలెనే నిశ్చలాత్మకంబై యుండుటె బాహ్య నిర్వికల్ప సమాధియనదగు. మరియు మనోగత కామ సంకల్పాదులే దృశ్యంబులు, తా వాటికి సాక్షియని అనుసంధానంబు చేయుటె అభ్యంతర దృశ్యానువిద్ధంబను సవికల్ప సమాధియనదగు. ఆసంగ సచ్చిదానంద స్వప్రకాశాద్వయ స్వరూపంబె తానని చింతించుటె అభ్యంతర శబ్దానువిద్ధంబను సవికల్ప సమాధియనదగు. స్వానుభూతిరసావేశంబుచేత దృశ్య శబ్దంబులను రెంటిని విడిచి నివాతస్థితదీపంబు చందంబున నిష్పంద రూపంబై యుండుట అభ్యంతర నిర్వికల్ప సమాధియనదగు. ఈయారు సమాధులచేత కాలంబు గడపు యోగీశ్వరునకు మనంబెందెందు సంచరించినను అందందు సమాధియెయగు.

## 71. జ్ఞానఫల చతుష్టయం

దుఃఖాభావ, సర్వ కామాప్తి, కృతకృత్యత్వ, ప్రాప్యప్రాపక త్వంబులనునివి జ్ఞానఫలంబులు చదుర్విధంబు. వాటియందు దుఖాభావం బనునది ఇహపరలోక భేదంబుచే ద్విప్రకారంబైయుండు. స్థూల శరీరంబు నందు కురూపత్వ దుర్గంధత్వ వ్యాధ్యాదులను, సూక్ష్మ శరీరంబునం దోచు కామక్రోధాది వ్యాధులను, కారణ దేహమందు ఆధివ్యాధులకు బీజ భూతంబైన సంస్కారంబులనెడి త్రివిధ సంతాపంబె ఇహలోక దుఃఖమనదగు. మిథ్యాత్మక మాయాకార్యంబులైన శరీరాదులకంటె వేరైన అద్వితీయ్యుండైన ప్రత్మగాత్మ జ్ఞానంబుచే మీద పరమార్థంబగు. భోగ్యభోక్తృవులు లేవు గావున జ్ఞానికినట్టి

దుఃఖత్రయ సంబంధంబులేక యుండుటె ఇహలోక దుఃఖాభావమనదగు. మరియు పుణ్యమెట్లు గల్గునో పాపంబెట్లు బోవునోయను చింత పరలోక దుఃఖంబనదగు. అందు సమ్యక్జ్ఞానానంతరంబున కమల పత్రోదకంబు తెరంగున జ్ఞాని కా కర్మద్వయ లోపంబులేక యుండు గావున కాష్టంబునందు వహ్నియుండు వహ్నియందా కాష్టంబులేనట్లు కర్మద్వయ వ్యావహారంబు నందు వివేకిగల యాతనియందు నావ్యవహారంబునందు పక్షిమృగంబులు చొరలేనట్లు జ్ఞానాగ్నిమయుని సుకృతాదులు చొరనేరవు. అందుచె చింతలేక యుండుటె పరలోక దుఃఖాభావంబగు. అనంతరంబున సకలైశ్వర్య సంపన్న సార్వభౌమాది హిరణ్య గర్భాంతంబుగా నుత్తరోత్తరంబై యపేక్షింపందగిన శతగుణోత్తరానందంబు లెల్ల నిస్పృహుండగు వివేకికి గలిగి యుండుటచేత మరి యా యానందంబులన్ని యా జ్ఞానిచేత దెలియంబడి బ్రహ్మాంశంబు లగుట చేత నతనికి యఖండానంద సిద్ధి గలిగె గావున నిదె సర్వకామాప్తి యనదగును. పిదప నీ వివేకికి తత్వ జ్ఞానంబున కంటె పూర్వంబె ఇహలోక సంబంధంబైన యిష్ట ప్రాప్త్యనిష్ట నివృత్తుల కొరకు కృషి, వాణిజ్యాదికంబును స్వర్గాదిసిద్ధికై యా గోపవాసనాదికంబును మోక్షసాధన జ్ఞానసిద్ధికై శ్రవణాదికంబను నీ త్రివిధంబు కర్తవ్యం బైయుండు. నిప్పుడీతత్వ జ్ఞానానంతరంబునందు సాంసారాదిక ఫలభోగేచ్ఛలేదు గావున, కృషి మొదలయిన వ్యాపారంబులు లేవు. మరి గవాక్ష గత సూర్యకిరణంబున గనుపించు పరమాణుల సంచారంబు బైన మహా ప్రకాశంబున కనుపించనియట్లు అల్పజ్ఞాన విషయంబగు కర్మంబంతయు సమ్యక్జ్ఞాన మధ్యంబున దోచకుండుగావున అనుష్టింపదగినది గాదు. అందువల్ల యాగాది వాంఛలు గలుగవు. బ్రహ్మానంద సాక్షాత్కారం బవుటచేత శ్రవణాదికంబు లన్నియు కృత ప్రాయంబులగు. ఇట్టిదె కృతకృత్యత్వమనదగు.



పిదప దనకు విశిష్టపుణ్యపరిపాక ముముక్షుత్వ గురుపాస్తి శాస్త్రశ్రవణ ఆత్మానాత్మ వివేక అజ్ఞాన నివృత్తి సాక్షాత్కార సంసారదుఃఖ నివృత్తి నిజానందాదుల సిద్ధియె ప్రాప్య ప్రాపకత్వ మనదగు.

## 72. విద్యాద్వయం

జీవన్ముక్తి విదేహకైవల్యంబులను మోక్షంబులుద్వివిధంబు. వాటియందు వివేకికి అహమాత్ముల కన్యోన్య సంబంధలక్షణ హృదయ గ్రంథి శిధిలత్వంబు నొందెగావున పర శరీరంబు నందెట్లట్లు స్వశరీరంబునందు దృఢాభిమానంబులేని యనుభవ సామ్యంబవుటచేత ప్రారబ్ధభోగ సాక్షాత్కారంబు సుప్త బాలాదులట్ల మందానుసంధానంబవుట వల్లను దేహాది నిరభిమానత్వంబు చేత ఘటోత్పత్యనంతరంబున మరి కులాల చక్రభ్రమణంబు వలెనే తత్ప్రారబ్ధ వాసనావశంబుచే జీవించుటె జీవన్ముక్తి యనదగు. మరియు బ్రహ్మజ్ఞానోద యానంతరంబున సూర్యోదయంబుచేత నంధకారంబు చెడునట్లు అజ్ఞానంబుతోడ తత్కార్యమైన శరీరాదులు నశించి విదేహకైవల్యంబు గలుగక మధ్యె జీవన్ముక్తి కల్పన యట్టినిన వివేకంబుచేత రజ్జువందు సర్పభ్రాంతి నష్టంబయ్యు తత్కార్యంబైన భయ కం పాదులుండునట్లు జ్ఞానంబుచేత నజ్ఞానంబు చెడినను వానికార్యంబైన శరీరాదులకు స్థితి గలిగియుండు. ఇట్లుగాక బ్రహ్మవిద్యోత్పత్తి సమకాలంబునందు నిశ్శేషంబై అజ్ఞానంబుతో గూడి దేహపాతంబైన బ్రహ్మవిద్యా సంప్రదాయ విచ్ఛిత్తియగు గావున, మరి యటులైన నేమియనిన, పరశివునినుండి బ్రహ్మయు, బ్రహ్మచే ప్రజాపతులును, వారివల్ల మనువు, మనువుచే ప్రజలెరింగిరని బ్రహ్మవిద్యా సంప్రదాయంబు చెప్పెడి ఛాందోగ్య శృతి విరోధంబు అగుగావున జ్ఞానికి జీవన్ముక్తి సిద్ధించుటకై ప్రారబ్ధ కర్మవాసనయు అజ్ఞానలేశ సద్భావంబును యంగీకరించుటచే దేహస్థితియును

శిష్యోపదేశాదికంబులును సిద్ధింపుచుండు. మరియు నా జీవన్ముక్తునకు సంచిత కర్మంబె తూలకణమగ్నిచే నష్టంబైన తెరంగున దగ్ధంబగు. ప్రారబ్ధకర్మంబె యనుభవించిపోవు. ఆగామికర్మంబునకనధికారిగావున ఫలింపకుండునని తెలియంబలికి మరి జ్ఞానాగ్నిచే గ్రాగిన కర్మంబె ప్రారబ్ధ భోగం బొసంగుటచేత మీద దేహోత్పత్తిని జేయనేరదే యనిన, తప్తచణకాది బీజంబులు భోగమాత్రంబునకు యోగ్యంబగుగాని అంకురోత్పత్తికి కారణంబుగాని యట్లు జ్ఞానియొక్క కర్మంబు ప్రారబ్ధ భోగంబుచే తీరు గావున జన్మాంతరంబునకు హేతువు గానేరదని తెలియందగు. మరి యా ప్రారబ్ధ కర్మంబేలేక యాత్రల నధికరించని అస్మదాది నరులకొక్క దేహంబుననే భోగ్యంబగు. లోకయాత్రల నధికృతులయిన మను వ్యాసాది మహాపురుషులకు దశ సంఖ్య దేహంబుచేగాక తీరకుండినను జ్ఞానంబునకు తిరోధానంబు లేదుగావున బాల్య కౌమారాది భేదంబులు గల్గినను నరునకొక్క దేహంబెయని దెలియందగు. మరి సకల విషయంబులకు మిథ్యాత్వంబు సాధింపుచుండెడి జ్ఞానంబునకును, విషయంబులకు సత్యత్వంబు సాధించెడి ప్రారబ్ధ భోగంబునకును అన్యోన్య విరోధంబు గలదు గాన జ్ఞానికెట్లు భోగస్థితి గలుగుననిన మిథ్యాత్మక స్వప్నేంద్రజాలంబులందు క్రమంబుగా వనితాది స్వర్గాదులు దోచి మైధునాది విస్మయాదులచే నిజభోగంబగు చందంబున వ్యావహారిక ప్రారబ్ధ భోగంబునకు విషయంబు లసత్యత్వ దర్శనంబు గల్గినగాక గూడదను నియమంబు లేదు గావున ప్రారబ్ధ భోగంబులకును జ్ఞానంబున కన్యోన్య విరోధంబు గలుగదు. అట్లగుటచే జ్ఞానికి ప్రారబ్ధ భోగంబు గలదని విదితంబగు. మరి యిచట భ్రాంతి నశించినంతటనే శుక్తికి రజిత స్వరూపంబు బోవునట్లు జ్ఞానంబుచేత నజ్ఞానంబు నశించునపుడె జగత్రపంచము తోచుటు లేదు గాన, అట్టి వివేకికి ప్రారబ్ధభోగంబెట్లు



గల్గుననిన శుక్తికా రజితంబనెడిది నిరుపాధిక భ్రమయనదగునని తెలిసినపుడె రజిత స్వరూపంబునకు నాశంబు గల్గు. ఈ సోపాధిక భ్రమయందట్లుగాదు. అదెట్లనిన స్వచ్ఛంబగు జలంబులుగల కొలంకు కెలంకున మెలంగునతండు నేనీ జలంబులందు యథోముఖుండనై యుండుట మృష యని, తీరంబున తనయందె బుద్ధి నిశ్చుండై యుండినను అయ్యధోముఖ రూపంబుదోచు చున్నయట్లు అహంకార సంబంధమైన జీవభావాదికంబె మిథ్యయని ప్రత్యగాత్మ తానని దెలిసినను, జీవత్వాది ప్రపంచంబు యుండుగావున, జీవున్ముక్తునకు ప్రారబ్ధ భోగవ్యవహారం బంగీకృతమగు.

## 73. జీవన్ముక్తుని సద్గుణ చతుష్టయం

అట్టి జీవన్ముక్తునకు మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షలనెడి సద్గుణ చతుష్టయంబుగలదు. అందు సత్పురుష సహవాస స్నేహంబులే మైత్రియనదగు. దుఃఖితాత్ములందు పరితాపంబె కరుణ యనబడు. పుణ్యకారులందు సంతోషంబె ముదిత యననొప్పు. పాప జనుల యందు రాగద్వేషంబులేక యుండుటె ఉపేక్షయనదగు.

## 74. జీవన్ముక్తుని పంచ ప్రయోజనములు

జీవన్ముక్తునకు జ్ఞానరక్ష, తపస్సు, సర్వసంవాదంబు, దుఃఖసంక్షయంబు, సుఖావిభావంబను నివె పంచ ప్రయోజనంబులు. వాటియందు వాసనాక్షయ మనోనాశంబులచే బుద్ధి నైర్మల్యంబై యుండుటె జ్ఞానరక్ష యనిబలుకుదురు. పిదప యింద్రియ మనంబుల కేకాగ్రత గలుగుటే తపస్సని జెప్పుదురు. అట్టి తపోనిష్ఠుండైన జీవన్ముక్తుని ఆబాల పండితులు యోగీశ్వరుండని స్తుతియించి నమస్కారాదులచే బహుమానంబు చేసినదె సర్వ సంవాదంబనదగు. మరి ఆస్మితాది క్లేశంబు లేకుండుటె దుఃఖసంక్షయంబ

నబడు. సాధనంబులచేత నతనికొక్క ప్రతిబంధము లేకుండుటె సుఖావిభావంబనదగు.

## 75. జ్ఞాన దశచిహ్నం - నిగ్రహానుగ్రహం

ఆక్రోధ, ఆరోగ్య, జితేంద్రియత్వ, దయా, క్షమా, జనప్రియత్వ, అలోభ, దాతృత్వ, అభయ, నైర్మల్యంబులనునివి జ్ఞాన దశచిహ్నాంబులనదగు. మరియు నిట్టి జీవన్ముక్తునిచే శిష్య, భక్త, ఉదాసీన, పాతకులను చతుర్విధ జనుల కనుగ్రహంబు దొరకొను నదెట్లనిన తత్త్వోపదేశంబు జేయు జీవన్ముక్తునిచే శిష్యునకు, విశ్వాసంబుచేత ముక్తియును, మరియు ననురాగంబున నతని యారాధనంబు చేయుభక్తునకు సుకృతాది విషయంబులును, అతని సచ్చరితంబు గనని ఉదాసీనునకు పుణ్య కృత్యాభిరతియును, యతని దర్శనస్పర్శనాదులచేత పాతకికి పాప క్షయంబునగు. మరియిచట కర్తృత్వాదులులేని జీవన్ముక్తునిచే వేదాంత వాక్య శక్తి తాత్పర్య అనుకూలత దృష్టాంతాదులచేత యత్న పురస్పరమైన బ్రహ్మోపదేశాదికవెట్లు ఘటించుననిన అతిరోహిత బ్రహ్మ స్వరూపుండగుటవల రాగద్వేషాదులు లేని యీశ్వరునకు అనుగ్రాహ్య నిగ్రాహ్య జనుల సుకృతదుష్కృత వశంబుచేత అనుగ్రహ నిగ్రహ చేష్ట దొరకొను నట్లు సాధకుల సుకృతాది ప్రభావంబువల్లను జ్ఞానిచే ఉపదేశాదికంబులగు ననుట సిద్ధంబు.

## 76. ప్రారబ్ధ కర్మ సంస్కార చతుష్టయం

ఇంకను జీవన్ముక్తులిట్లు చెప్పిన సల్లక్షణంబుచె నుండక బ్రహ్మప్రకారంబులై యుండుటెట్లనిన, ప్రారబ్ధ కర్మసంస్కారంబదది తీవ్రంబని మధ్యమంబని మందమని సుప్తమని నాల్గు తెరంగులై యుండు. దానియందు సమ్యక్‌జ్ఞాని యయ్యును భోగమందే తత్పరుండై పశువట్లాత్మ ప్రీతి మాత్రంబున నుండుటె తీవ్ర సంస్కార మనదగు. భోగంబునకు ముఖ్యత్వమైనను తానాత్మ తత్పరుండై బాలకుని యట్లు వినోదంబుగా వుండుటె మధ్య సంస్కారమనదగు. సకల భోగంబులు విడిచి పరమాత్మునందే తత్పరుండై సురతసుఖ మిధునంబట్ల నిజానందంబుచే యుండుటె మంద సంస్కారం బనదగు. సర్వ వ్యాపారంబులు విడచి నిరుపాధికాత్మునియందే తత్పరుండై పరమముక్తునియట్లు పరమ సుఖంబుచే యుండుటె సుప్త సంస్కారమనదగు. మరియు నిందు చతుర్విధంబగు ప్రారబ్ధ కర్మసంస్కార వశంబుచేత జీవన్ముక్తులు నానాపతనంబుల తోడనుండిన ఋజుకుటిల గతులు గల నదులకు సముద్ర సంబంధంబట్ల కడపటియందు బ్రహ్మ స్వరూపమై యుండెడి ముక్తి సుఖంబొక్క ప్రకారంబై యుండును.

## 77. ప్రారబ్ధ త్రయం

ఇచ్ఛాప్రారబ్ధంబు, అనిచ్ఛాప్రారంబ్ధంబు, పరేచ్ఛా ప్రారబ్ధంబులను నీ త్రివిధ ప్రారంబ్ధం బేదేవతలచే నివారింప నశక్యంబై యుండు. వాటియందు అపథ్య శేవనాదికంబు చేత తనకు గల్గునట్టి అనర్థంబెరింగియు విడువ నియ్యక సేవింపజేయునదె యిచ్ఛా ప్రారబ్ధంబనదగు. చేయనొల్లనవైనను, హింసాదికంబుల రాజాజ్ఞ వలెనే బలాత్కారంబుచే జేయించునదె అనిచ్ఛా ప్రారబ్ధంబనదగు. తనకిచ్ఛానిచ్ఛలు లేకున్నను పరదాక్షిణ్యంబుచేత సుఖ దుఃఖంబుల ననుభవింప జేయునదె పరేచ్ఛాప్రారబ్ధంబు. ఇట్లు త్రివిద ప్రారబ్ధానుసారంబు వలనను జీవన్ముక్తునకు విచిత్ర చరిత్రంబులు గలదనుటె సిద్ధంబగు. మరియు నీ యర్థంబున సకలజనక భరత యాజ్ఞవల్క్య శుక వాల్మీకి వామదేవ గౌతమ

ప్రహ్లాద విశ్వామిత్ర వసిష్ఠ దుర్వాస నారదాదుల వర్తనాభేదంబులె నిదర్శనంబై యుండు.

## 78. అజ్ఞానికి జ్ఞానికి భేదం

ఇచట జ్ఞానికి ప్రారబ్ధ భోగంబంగీకరింప అజ్ఞానిజ్ఞానుల కేమి భేదంబనిన వ్రాత్యశ్రోత్రియులకు వేదాధ్యయన పరిత్యాగంబు వేదాధ్యయన యుక్తత్వంబుల చేతనే భేదంబుగాని ఆహార నిద్రాదుల భేదంబు లేనట్లు అజ్ఞానిజ్ఞానులకును హృదయగ్రంధి సంబంధాసంబంధంబులచేత భేదంబుగలదు గాని భోగస్థితిచే భేదంబు లేదనుటె సమ్మతియగు. మరియు నిందు తత్త్వజ్ఞానంబుచేత బ్రహ్మప్రాప్తి గలిగిన వ్యాఘ్ర సందర్శకునియట్ల జీవత్వంబు నశించు గావున తననాశంబునకు జీవుండెట్లు ప్రవర్తించు ననిన యెట్లు లోకంబునందు దేవత్వాభి వాంఛజేత భృగ్వగ్ని గంగా ప్రవాహ యాగాదులందు నరత్వ పరిత్యాగం బంగీకరింపుచుందురట్లు ప్రత్యగాత్మ రూప బ్రహ్మత్వంబు చేయుచుండుటకై జీవుండు తత్త్వజ్ఞానంబుచేత తననాశంబంగీకరింపుచుండు ననుటె ప్రసిద్ధంబు.

## 79. జీవన్ముక్తుల శాపానుగ్రహ సామర్థ్యం

వ్యాసాదులట్లు శాపాను గ్రహసామర్థ్యంబెవ్వనికి గలదతండె తత్త్వజ్ఞానిగాక నన్యుండు గానేరదనిన నా సామర్థ్యంబు తపఃఫలంబై యుండుగాని తత్త్వజ్ఞాన ఫలంబుగాదని తెలియందగు. మరి యిట్లు బలుక తత్త్వజ్ఞానంబునకు తపంబె మూలంబని శృతి గలదు. గావున తపోరహితులకు తత్త్వజ్ఞానంబెక్కడిదనిన శాపాదులకు కారణంబైన సకామ తపంబుకంటె అన్యంబైన నిష్కామ తపంబుచేత తత్త్వజ్ఞానంబవునని పరామర్శించి తెలియందగు. మరి వ్యాసాదులకు తత్త్వజ్ఞాన సామర్థ్యంబులు రెండుగలవు గదా యనిన వారల కుభయ విధంబులైన తపంబులు గలవు.



గావున జ్ఞానసామర్థ్యంబులు రెండును సంభవింపు చుండును. మరియొక్కొక్కటె తపంబుశేయు వారలకు నొక్కొక్కటే సిద్ధింపుచుండు. గావున విరోధంబు లేదయ్యె. మరియు శాపాది సామర్థ్యంబులేని విధి శూన్యుండైన తత్త్వజ్ఞానిని గూర్చి క్రియానిష్ఠులందరు నిందింపుచుందురు గదా యనిన నా క్రియా నిష్ఠులకును విషయలంపటులగు పామరులచే నింద్యత్వంబు గలుగుటవల్ల వైషమ్యంబులేదు. మరి విషయలంపటులచేతనైన నిరాకరణంబువల్ల క్రియానిష్ఠులయిన విశిష్టియు దూషణంబులచే తత్త్వజ్ఞాని కేహానియు లేదనుటె యధార్థంబగు. మరియు నా జీవన్ముక్తుం డలౌకికుండవుటచె ప్రారబ్ధ వశంబుచేత విద్వవిద్వ దవస్థయందుండినను మారుతంబె శ్రితాశ్రిత మేఘపటల గగనంబట్లు నిత్యనమలుండగు. మరియు దృష్టమనెడి పరిచారకుని చాత దత్తమైన స్రక్చందనాది భోగస్వీకారంబుండినను నిజ భర్తృవందు సురతంబుజేయు పుంశ్చరియట్ల నిరపేక్షితంబు. వెండియు మూఢునిట్ల కళాభీజ్ఞత్వంబునందు మౌనియై యుండినను కల్పిత ద్వైత పరశృతీవాక్య వైఖరీ విషయంబులందలనుండగు. మరి ప్రస్థుతంబెరుంగని బహుభాషణుని యట్లు నెద్దిబలికిన నదె గూఢాభిప్రాయగభితమైన సత్యాద్వైత నిష్ఠ నిగమగాభిప్రాయంబగు. మరియాచార్యుని యట్ల శిష్యులకుపదేశింపు చుండినను ఆత్ముండు నిత్యముక్తుండవుటచేత బోధ్య బోధకత్వంబె మాయా రచనాత్మకంబను కృతనిశ్చయంబుచే గగన వాణియట్ల గురుత్వాభిమాన రహితుండగు. మరియు నున్మత్తుని యట్ల అనుచిత వక్తువైనను ద్వైతభావంబెలేని యాత్మారాముండవుటచే సురతాంత్య సమయంబునందు రతీకామాసక్త మిధునవాక్యంబట్ల అనభిధేయ విషయంబగు. మరిన్నీ పుత్రవియోగానుభవంబుగల గ్రామ్యజనునియట్ల శోకంబుచేశిన యదే

